# భక్తసంజీవని

ఇందు

భాగవతమునందలి పద్యములు

సంగ్రహింపఁబడి

రా[illegible]ము కృష్ణారావుచే

మానవసేవపత్రికయందు

ప్రకటింపఁబడెను

రాజమహేంద్రవరము.

శ్రీ విద్యానిలయ ముద్రాశాలయందు

ముద్రితము

1914

0—6—0

# పీ ఠి క

"మ. లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్విజయశ్రేయమై."

"ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు, విభూతికారణం
బెయ్యది, సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది, సర్వమంత్రముల నేలిన దెయ్యది, మోక్షలక్ష్మిరూ
పెయ్యది దాని నెన్నెద సుహృద్యము భాగవతాఖ్యమంత్రమున్."

వివిధతత్త్వార్థప్రతిపాదకంబును, బహువిధజ్ఞానబోధకంబును, భక్తిరసోద్దీపకంబును నగు శ్రీమహాభాగవతపురాణరాజంబు శ్రీపరమేశ్వరకరుణాకలితసహజకవితాసామ్రాజ్యధురంధరుండును, పరమభాగవతాగ్రసరుండును నగు బమ్మెర పోతనామాత్యకవిపట్టభద్రునిచే నాంధ్రీకరింపఁబడి, యతిసుకుమారసరసవచనరచనాధౌరేయమై, శబ్దార్థాలంకారశోభాయమానమై, కోవిదపామరజనహృదయంగమమై, వీనులవిందై, చదువువారికమందానందంబు గలిగించుచు, ఆస్తికశిరోమణుల కెల్లనైహికాముష్మికశ్రేయఃప్రదంబు నత్యంతోపాదేయంబునై యొప్పుచుండును.

ఇట్లు భాసిల్లు నీభాగవతపారిజాతంబునం దెల్లెడల నెల్లివిరిసి నిర్మలజ్ఞానసౌరభంబుల నల్లడలఁ వెదఁజల్లుచున్న భక్తిరసమరందపూరితంబులగుపద్యప్రసూనంబుల నెల్ల నేర్చి యొక్కగ్రంథమాలికఁగఁ గూర్చినచో నయ్యది భక్తజనహృదయాలంకారమై విలసిల్లు నని యెంచి, వాని నన్నింటి నొక్కచో సమకూర్చి యీగ్రంథమును బ్రకటించితి. మఱియు

నందలిపద్యంబులలోఁ గొన్ని యనతారాదిగుణవిశిష్టంబులై కేవలవైష్ణవపరంబులై యొప్పి యుండుటచే, నయ్యవి యొకించుక మార్చి సర్వమతసమ్మతంబుగ నుండునట్లుగ నుచితరీతిని సంస్కరించి వో, ఆస్తికుల కెల్లరకు నుపయుక్తంబులై వెలయఁగల వని యెంచి యట్లు కావించితి. కాని సలలితములై నయందలిపదంబులఁ దీసివైచి నాచప్పిడిపదంబులఁ జొప్పించుటచేఁ దదీయమృదుమధురధారాపాటవంబునకును, సుకుమారశయ్యాసౌష్టవంబునకును భంగము నాపాదించితి నేమో యని శంకించుచుంటిని. అయినను ఆపద్యముల నున్నవి యున్నట్లే ప్రచురించినచో నయ్యవి సర్వమతములవారికి ననుకూలించునట్లుగ నుండకపోవుటచేతను, సమస్తమతములయందలియాస్తికులకు నుపకరించునట్లు స్తోత్రవందనప్రార్థనాదికములకుపయుక్తములై నగ్రంథము లాంధ్రంబున నంతఁగా లేకుంటచేతను, అట్టివి యొకటిరెం డున్నను నవి భాగవతమువంటిగ్రంథముతో భక్తినిగాని కవిత్వమునఁ గాని సంపోల్పరాని వగుటచేతను, నిం దచ్చటచ్చట స్వల్పములగుమార్పులఁ గావించినను గ్రంథముయొక్క మహోపయోగమును బాటించి పాఠకులు నన్ను మన్నింపక పోవరను ధైర్యముతో నీకార్యమునకు సాహసించినాఁడను. మఱియు నాయావిషయముల కనువుపడునట్లుగఁ బద్యముల వేఱ్వేఱుశీర్షికలగ విభజించి యిందుఁ బ్రచురించితి. ఇం దేవేని దోసఁగులు పొసఁగునెడ, నయ్యవి పోతన కారోపింపక నావిగ నెంచి పాఠకులు నాకుఁ దెలిపెదరేని రెండవకూర్పున వానిని సవరించుకొనువాఁడ.

ఇట్లు విన్నవించు,

నాయని కృష్ణారావు.

# భక్త సంజీవని

## మంగళము

శా. శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ గల్మషో
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహానందోజ్జ్వలజ్జృంభకున్. 1

## కృత్యాదిపద్యములు.

మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైనమానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్. 2

క. భూషణములు చెవులకు బుధ
తోషణము లనేకఘోరదురితౌఘశని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు పరమపురుషుగుణభాషణముల్. 3

ఆ. అతిగహాస్యమైనహరిగుణకథనంబు
మనుజుఁ డెవ్వఁ డేని మాపు రేపుఁ
జాలభక్తితోడఁ జదివిన సంసార
దుఃఖరాశి బాసి తొలఁగిపోవు. 4

క. ఘన సంసారం బనియెడి
జననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడువానికి నీ
శునిగుణవర్ణనము చేప సుమ్ము తలంపన్. 5

## భగవంతుఁడు.

క. దేవుఁడు సర్వాత్ముండు మ
హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
భావింపను వర్ణింపను
సేవింపను భావ్యుఁ డఖిలజీవుల కెందున్. 6

క. హరి భగవంతుఁ డనంతుఁడు
గరుణాంబుధి సృష్టికార్యకారణహేతు
స్ఫురణుం డవ్విభుకంటెం
బరుఁ డెవ్వఁడు లేఁడు సూవె పరికింపంగన్ 7

క. నారాయణుండు జగదా
ధారుం డగునీశ్వరుండు దలఁప నతనికిన్
లే రెందు సములు నధికులు
ధీరోత్తముఁ డతఁడు నద్వితీయుం డగుటన్. 8

క. పరమబ్రహ్మ మనంగాఁ
బరతత్త్వ మనంగఁ బరమపద మనఁగను నీ
శ్వరుఁ డనఁ దేవుఁ డన జగ
ద్భరితుఁడు నారాయణుండు దా వెలుఁగొందున్. 9

ఉ. కాలము దేశముల్ గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయుం జగ
జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రము యగ్ని యాహుతుల్
వేళలు విప్రులుం జననవృద్ధిలయంబుల హేతుభూతముల్
లీలలఁ దాన యై తగ వెలింగెడు నెక్కటి తేజ మీశుఁడే. 10

క. కొందఱు స్వభావ మందురు
కొందఱు కర్మం బటండ్రు కొందఱు కాలం
బందురు కొందఱు దైవం
బందురు కొంద ఱొగిఁ గామ మందురు దేవున్. 1

సీ. భావించి కొందఱు బ్రహ్మం బటంచును దలపోసి కొందఱు ధర్మ మనియుఁ
జర్చించి కొందఱు సదసదీశ్వరుఁ డని, పరవిఁ గొందఱు శక్తిసహితుఁ డనియుఁ
జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుండధికుఁ డనియుఁ
దొడరి యూహింతురు తుది నద్వయాద్వయాసదసద్విశిష్టసంశ్రయుఁ డతఁడు.
తే. తలప నొక్కింత వస్తుభేదంబు గలదె
కంకణాదులఁ బసిఁడి యొక్కటియె కాదె
కడలు పెక్కైన వార్ధి యొక్కటియె కాదె
భేద మంచు నీశుని వికల్పింపఁ జనదు. 12

క. హరిమయము విశ్వ మంతయు
హరి విశ్వమయుండు సంశయము పని లే దా
హరిమయము గానిద్రవ్యము
పరమాణువు లే దఖిలభువనములయందున్. 13

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు గాన వెదకంగా నేల యీయాయెడన్. 14

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన
నం దందే గలఁడు బుద్ధి నరసికొనంగన్. 15

క. విశ్వాత్ముఁడు విశ్వేశుఁడు
విశ్వమయుం డఖిలనేత విష్ణుఁ డజుం డీ
విశ్వములోఁ దా నుండును
విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచు నుండన్. 16

క. మండలములోన భాస్కరుఁ
డుండి జగంబులకు దీప్తి నొసఁగెడి క్రియ బ్ర
హ్మాండములోపల నచ్యుతుఁ
డుండుచు బహిరంతరముల నొగి వెలిగింపన్. 17

క. అగుణుం డగుపరమేశుఁడు
జగములఁ గల్పింపఁ గోరుటకుఁ జతురత మాయా
సగుణుం డగుఁ గావున హరి
భగవంతుం డనఁగఁ బరఁగు భావింపంగన్. 18

ఉ. కర్మవశంబునన్ జగము గల్గును హెచ్చు నడంగు నన్నచోఁ
గర్మము బుద్ధిఁ జూడ జడకార్యము గాని ప్రపంచకల్పనా
కర్మమునందుఁ గర్త యనఁగా విలసిల్లఁగఁ జాల దీజగ
త్కార్మికకార్యకారణము గావున నీశుఁడు విష్ణుఁ డారయన్. 19

చ. జననము లేక కర్మములజాడలఁ బోక సమస్తచిత్ప్రవ
ర్తనుఁ డగువానికిం గవు లుదారపదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుందురు వేదరహస్యములందుఁ గొందుఁ జూ
చిన మతి లేవు జీవునికిఁ జెప్పవకైవడి జన్మకర్మముల్. 20

మ. భువనశ్రేణి నమోఘలీలఁ దగుచుం బుట్టించు రక్షించు నం
తవిధిం జేయు ముకుందుఁ డంచు హరి భూతవ్రాతముం దాత్మతం
త్రవిహారస్థితుఁ డై షడింద్రియసమస్తప్రీతియుక్ దవ్వులన్
దవిభంగిం గొనుఁ జిక్కఁ డింద్రియములం ద్రిప్తిన్ నిబంధించుమన్. 21

క. కలుగును మఱి లేకుండును
గలభూతము లెల్లఁ గాలకర్మవశము లై
నిలువఁడు ప్రకృతిం దద్గుణ
కలితుఁడు గాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్. 22

ఉ. సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వకర్తుఁడున్
సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుం డగుసర్వప్రకాశుఁ డీ
సర్వశరీరులున్ నిగమసంగతిఁ జెంది విశీర్యమాణు లై
పర్వినచో నభంగగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్. 23

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందుననర్థకముల్ ప్రబోధమం
దరయఁగ మిథ్య లై పురుషునందు ఘటింపనికైవడిం బరే
శ్వరునకు నాత్మసాధునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం
బరువడిఁ బొంద వెన్నఁటికిఁ బ్రాకృతదోషము లింతయేనియున్. 24

సీ. కలలోన జీవుండు గాత్రూహాలంబునఁ బెక్కుదేహంబులఁ బేరు వడసి
యింద్రియంబులవెంట నెల్లవృత్తంబులు వీక్షించి మఱి తన్ను నెఱుఁగుకరణి
నఖిలాంతరాత్మకుఁ డగుపరమేశ్వరుఁ డఖిలజీవులహృదయముల నుండి
బుద్ధివృత్తుల కెల్ల బోధి యై వీక్షించు బద్ధుండు గాఁడు ప్రాభవమువలన
తే. సత్యుఁ డానందబహుళవిజ్ఞానమూర్తి
వందనీయుఁడు సద్భక్తవత్సలుండు
యతని సేవింప నగుఁ గాక యన్యసేవఁ
గలుగ నేరవు కైవల్యగౌరవములు. 26

సీ. సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు సృష్టి యెవ్వనిచేతనే జనించు
జగములు నిద్రింప జాగరూకత నొంది యెవ్వఁడు బ్రహ్మంబ మెలఁగుచుండు
నాత్మ కాధారంబు నఖిలంబు నెవ్వఁడే నెవ్వనినిజధనం బింతవట్టుఁ
బొడగాన రాకుండుఁ బొడగను నెవ్వఁడే నెవ్వనిసృష్టికి నెదురు లేదు
ఆ. జననవృద్ధివిలయసంగతిఁ జెందక
యెవ్వఁ డెడపకుండు నెల్లయెడలఁ
దనమహత్త్వసంజ్ఞతత్త్వ మెవ్వఁడు దాన
విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు 27

సీ. ఒక్కఁడై నిత్యుఁడై యొక్కెడఁ గడ లేక సారిది జన్మాదులశూన్యుఁ డగుచు
సర్వంబునం దుండి సర్వంబుఁ దనయందు నుండంగ సర్వాశ్రయుం డనంగ
సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు సామ్యమై స్వప్రకాశమున వెలిఁగి
యఖిలంబుఁ జూచుచు నఖిలప్రభావుఁడై యఖిలంబుఁ దనయందు నడఁచికొనుచు
తే. నాత్మమాయాగుణంబుల నాత్మమయము
గాఁగ విశ్వంబు తనసృష్టి ఘనతఁ జెందఁ
జేయుచుండును సర్వసంజీవనుఁడు
ప్రథితవిశ్వాత్ముఁ డైన నారాయణుండు 28

క. సతు లెవ్వరు సుతు లెవ్వరు
పతు లెవ్వరు మిత్రశత్రుబంధుప్రియసం
గతు లెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షి యైన ఘనుఁ డొక్కనికిన్. 29

# భా గ వ తు లు

సీ. ఘోరాత్యంతవికారాంత మత్యనుక్రమణీయభగవత్ప్రసంగతుల్ భాగవతులు
సకలసమ్ముఖయోగిజనసదానందైకపరమభాగ్యోదయుల్ భాగవతులు
దేవదేవధ్యానకేవలామృతపానపరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకానీకపరిభవప్రక్రియాపరుషోగ్రమూర్తులు భాగవతులు
తే. భావతత్త్వార్థవేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటు లేని
పదవి నొప్పారువారు వో భాగవతులు. 30

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన మాతృభావము సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు
తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతము లంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
పరమపావనచరితుఁడు భాగవతుఁడు. 31

సీ. ఆకారజన్మవిద్యాఢ్యవరిష్ఠుఁడై గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు
వివిధమహానేకవిషయసంపన్నుఁడై పంచేంద్రియములచేఁ బట్టుపడఁడు
భవ్యవయోబలప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రిందుకొనఁడు
కామినీప్రముఖభోగము లెన్ని గలిగిన వ్యసనసంసక్తి నావంకఁ బోఁడు
ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు
భక్తుఁడైన భాగవతుఁ డీశ్వరధ్యాన
తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు 32

సీ. చిన్మయాత్ముఁడు దన్నుఁ జేరినయట్లైనఁ జెలికాండ్రి నెవ్వరిఁ జేర మఱచు
నఘహారి దన మ్రోల నాడినయట్లైనఁ దోడివారలతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ బరభాషలకు మాఱు పలుక మఱచు
మునివంద్యుఁ దనలోనఁ గనుఁగొనినట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు
తే. హరిపదాంభోజయుగచింతనామృతమున
నంతరంగంబు నిండినదైన భక్తుఁ
డఖిలపరిపూర్ణుఁ డగుచుఁ దా నన్ని మఱచి
జడత లేకయ యుండును జడునిభంగి. 33

శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం
ధానుండై మఱి పొందు భాగవతుఁ డేతద్విశ్వమున్ సర్వమున్ 34

సీ. పరమేశచింతావివర్జితచేష్టుఁడై యొక్కఁడు ఏడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియ గాని వేఱొండు లేదని యుత్తిలి నగుచుండు నొక్కచోట
విమలాత్ముఁ డనునిధానముఁ గంటి నే నని యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ
ఆ. పలుకు నొక్కచోట భక్తుఁడు పరమేశుఁ
బ్రీతియుహర్షజనితబాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు. 35

సీ. అడుగడుగునకు నీశ్వరానుచింతనసుధామాధుర్యమున సోలు మఱచువాఁడు
అమలయోగీంద్రులు నభ్యసింపఁగ లేని హరిభక్తిపుంభావమైనవాఁడు
లోకవిజ్ఞానంబు లోఁ గొన్న దాదిగాఁ జిత్త మచ్యుతునందుఁ జేర్చువాఁడు
అంకించి తనలోన నఖిలప్రపంచంబు శ్రీవిష్ణుమయ మని చెలఁగువాఁడు
తే. వినయకారుణ్యబుద్ధివివేకలక్ష
ణాదిగుణముల కాటపట్టయినవాఁడు
అఖిలబుధలోకసంభావ్యుఁడైనవాఁడు
భక్తిభావాభిరతుఁడు వో భాగవతుఁడు. 36

సీ. వాసించు శాస్త్రలో బ్రహ్మవిజ్ఞానంబు నాశించు భాగవతార్చనంబు
భూషించు నేప్రొద్దు భువనైకరక్షకు భాషించు హరికథాప్రౌఢి మెఱసి
ఘోషించు హరినామగుణనికాయంబులు పోషించుఁ బరతత్త్వబోధ మెఱసి
సేవించు నీశ్వరసేవకనికరంబు గావించు బహుపుణ్యకార్యతతులు
తే. పాడుఁ బాడించుఁ బరమాత్మభవ్యనటన
రూపవర్తనగుణనామదీపితోరు
గీతజాతప్రబంధసంగీతవిధుల
భక్తిభావాభిరతుఁడు వో భాగవతుఁడు. 37

సీ. ఆసక్తి పరమేశ్వరావలోకనమంద చింత యీశ్వరపాదసేవయంద
వెఱపు నారాయణవిముఖకార్యములంద పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్పనిర్గతి పరబ్రహ్మసంస్తుతులంద పక్షపాతము హరిభక్తులంద
లేమి ముకుందాన్యలీలాచరణమంద శ్రమము సర్వజ్ఞపూజనములంద
తే. బంధ మచ్యుతేతరదుష్టపథములంద
జ్వర మన్యాయవిరహితక్షణములంద
మచ్చరము లీశకైంకర్యమతములంద
తవిలియుండురు భక్తసత్తములు సతము 38

సీ. చిత్తంబు విశ్వాత్మశ్రీపాదములయంద పలుకులు హరిగుణపఠనమంద
కరములు విష్ణుపరిచారములయంద శ్రవణములు హరికథాశ్రవణమంద
చూపులు సర్వేశరూపవీక్షణమంద శిరము దేవునినమస్కృతులయంద
పదము లీశ్వరకార్యపరివర్తనములంద కామంబు స్వామికైంకర్యమంద
తే. సంగ మచ్యుతజనగణసంగమంద
ఘ్రాణ మన్యాయదివ్యాంఘ్రికమలమంద
రతి లఘుపుణ్యకార్యసంగతులయంద
పరగియుండుట నైజంబు భక్తతతికి 39

శా. ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ
గ్జాలంబుల్ హరిమూర్తిపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ ని
ర్మాలీభూతమనోవ్యథానిచయుఁడై మోదించి భక్తుండు సం
శీలం బొప్ప నుతించుఁ గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్. 40

క. హరి యని సంభావన విను
హరి యని దర్శించు నంటు నాఘ్రాణించున్
హరి యని రుచి గొనఁ దలఁచును
హరిభక్తునిమహితగుణము లలవియె పొగడన్ 41

క. హరిభక్తులతో మాటలు
ధర నెన్నఁడుఁ జెడనిపుణ్యధనములమూటల్
పరముక్తి కాంత తేటలు
నరిషడ్వర్గంబు చొరని యసదగుకోటల్ 42

చ. హరిచరణారవిందయుగళార్చనసన్మతిభక్తిరాగముల్
నిరతము గల్గువారలు మునీంద్రులకైనను వందనీయ భా
సురపదమందుఁ జేరుదురు సూరిజనస్తవనీయు లట్టిస
త్పురుషులభూరిభాగ్యఫలముల్ గణుతింపఁ దరంబె యేరికిన్ 43

సీ. పరమాత్మలీలలు భవ్యప్రభావముల్ సన్మహిమంబులు సద్గుణములు
విని భక్తుఁ డగువాఁడు వేడ్కతోఁ బులకించి కన్నుల హర్షాశ్రుకణములొలుక
గద్గదస్వరముతోఁ గరుణామయా దేవ వరద నారాయణ పరమపురుష
యంచు నొత్తిలిపాడు నాడు నాక్రోశించు నగుఁ జింతనము సేయు నతిరయునర్చు

తే. మరలుకొనిచూచుఁ దనలోన మాటలాడు
వేల్పు సోఁకినపురుషునివృత్తిఁ దిరుగు
బంధములఁ బాసి యజ్ఞానపటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తివిభుఁ డగుచు 44

మ. హరినామాంకిత మైనగీత మొకమా టాలించి మాహాత్మ్యమున్
నిరతిం బొందఁగఁ జాలియుండు రఁట యావిశ్వాత్మ వీక్షించుచున్
బరితోషించును నాడుచున్ నగుచు సంభాషించుచున్ బాడుచున్
బరమానందనిమగ్నులౌ ఘనులు నిర్వాణాప్తులౌ టబ్రమే 45

తే. అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టిముక్తి
వర్తి యీలోకమందు నెవ్వరికిఁ గలదు
సాధులును బుణ్యశీలురు సజ్జనులును
హరిపరాయణతత్పరు లయినఁ గాక. 46

క. జ్ఞానములచే ధ్యానములచే
దానములచే యోగసంవిధానములచేతన్
బూని నిబద్ధుం డగునే
శ్రీనిలయుఁడు భక్తియుతులచేతంబోలెన్ 47

తే. ఇను మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశుసన్నిధి నావిధమునఁ
గరఁగు చుండును దైవయోగమునఁ జేసి
భక్తవర్యునిచిత్తంబు భ్రాంత మగుచు 48

క. సిరియురాశిపలనివార్తలు
ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియ మగుభంగిం
బ్రియుఁ డగుహరిచరితంబులు
ప్రియభక్తుల కెల్లరొడలఁ బ్రియములు గావే 49

ఆ. భక్తవత్సలుఁ డగువరదుండు భక్తుఁడు
తనదుకీర్తనంబు దవిలి పాడఁ
జీరఁబడ్డవాని చెలువున నేతెంచి
యతనిమనమునందు నధివసించు 50

క. ధీరులు నిరపేక్షులు నా
శాత్రరాఘులు జైనమునులు హరిభజనము ని
ష్కారణము సేయుచుందురు
వారల నారాయణుండు వదలక యుండున్ 51

చ. ఇతరము మాని తన్ను మది నెంతయు భక్తి భజించువారి నా
శ్రితజనసేవితాంఘ్రిసరసీరుహుఁ డైనయనంతశాయి వం
చితదయతోడ నిష్కపటచిత్తమునం గరుణించు వా
రతులమహంత మై తనరు సర్వభయాళిఁ దరింతు రెప్పుడున్ 52

మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి సర్వేశ్వరున్
సగుణభ్రాజితు నచ్యుతున్ బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వభూ
తగణావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైకపారీణు నా
జగదాత్ముం గను మందు రార్యులు తపశ్శక్తిన్ స్ఫుటజ్ఞాను లై 53

మ. ఒకమా రెవ్వనిపేరు కర్ణములలో నొయ్యార మై సోకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి కృష్ణున్ దేవదేవు న
త్యకలంకస్థితిఁ గొల్చుభక్తులకు లే దడ్డంబు ధాత్రీస్థలిన్ 54

క. నారాయణసేవామృత
పారావారమునఁ దేలుభక్తుఁడు దా భూ
దారకరఖాతకోదక
పూరంబుల నేల తృప్తిఁ బొందుఁ దలంపన్ 55

మ. భరితోదగ్రనిదాఘసంతప్తుఁ డగునప్పాంథుం డరణ్యాదిసం
చరణక్లేశసముద్భవం బగుపిపాసం గెంది యాత్మీయమం
దిరముం జేరి గతశ్రముం డగుచు నెందేఁ బోనిచందంబునన్
హరిపాదాబ్జమరందసక్తుఁ డగువాఁ డన్యంబు దాఁ గోరునే 56

మ. హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁ డైనట్టిస
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే
వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స
త్వర మై పోవునె చేదువేములకుఁ దద్గంధానుసంధాత్మ మై 57

చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు
స్థిరత విశోకసౌఖ్యములఁ జెందినధీనిధు లన్యకృత్యముల్
మఱచియుఁ జేయ నొల్లరు తలంచిన నట్టిద యౌ నరేంద్రుఁడుం
బరువడి నయ్యె ద్రిప్వ్యాని పిపాసితుఁ డై సలిలాభిలాషతన్ 58

క. అనఘాత్మమహిమ నిత్యము
వినుతించుచు నొరులు పొగడ వినుచున్ మదిలో
నను మోదించుచు నుండెడు
జనములు దన్మోహవశతఁ జన రెప్పటికిన్ 59

సీ. కమనీయభూమిభాగములు లే కున్నవే పడియుండుటకు దూదిపఱుపు లేల
సహజంబు లగుకరాంజలులు లే కున్నవే భోజనభాజనపుంజ మేల
వల్కలాజినకుశావళులు లే కున్నవే కట్ట దుకూలసంఘంబు లేల
గొనకొని వసియింప గుహలు లే కున్నవే ప్రాసాదసౌధాదిపటల మేల

తే. ఫలరసాదులు గురియవే పాదపములు
స్వాదుజలముల నుండవే సకలనదులు
పొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు
ధనమదాంధులకొలు వేల తాపసులకు 60

క. రక్షకులు లేనివారల
రక్షించెద ననుచు నజుఁడు రా జై యుండన్
రక్షింపు మంచు నొకనరు
నక్షముఁ బ్రార్థింప నేల యాత్మజ్ఞులకున్ 61

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యమున్
ఒల్లరు యోగసిద్ధి మఱి యొండుభవంబుల నొందనీనియా
సల్లలితాత్మపాదయుగసంగతి నొందినధన్యు లెప్పుడున్ 62

# భగవన్నామసంకీర్తనము

క. తరణంబులు భవజలధికి,
హరణంబులు దురితలతల, కాగమముల కా
భరణంబు, లార్తజనులకు
శరణంబులు పరమపురుషసంస్మరణంబుల్ 63

క. ఉరుసంసారపయోనిధి
తరణంబులు, పాపపుంజహరణంబులు, శ్రీ
కరణంబులు, ముక్తిసమా
చరణంబులు దేవదేవుసంస్మరణంబుల్. 64

క. భూషణములు వాణికి, నఘ
పేషణములు, మృత్యుచిత్తభీషణములు, హృ
త్తోషణములు, కల్యాణవి
శేషణములు హరిగుణోపచితభాషణముల్ 65

క. అమదినసంతోషణములు
జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
అనఘునిసంభాషణములు
మునిజనులకుఁ గర్ణయుగళములభూషణముల్ 66

క. మంతనములు సద్గతులకుఁ,
బొంతనములు ఘనము లైనపుణ్యముల, కిదా
నీంతనపూర్వమహాఘని
కృంతనములు రామనామకృతిచింతనముల్ 67

క. పరిభూతవ్యథనంబులు
నిరుపమసంసారజలధినిర్మథనంబుల్
పరమేశ్వరకథనంబులు
పరిరక్షితసర్వలోకవరమిథునంబుల్ 68

క. కామంబు, పుణ్యమార్గ
స్థేమంబు, మునీంద్రసాంద్రచేతస్సరసీ
ధామంబు, విష్ణునిర్మల
నామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాఁడే 69

ఆ. మోక్షకాముసకును మోక్షంబు సిద్ధించు
భవభయంబు లెల్లఁ బాసిపోవు
యోగిసంఘమునకు నుత్తమవ్రతములు
పరమపురుష నామవర్ణనములు 70

తే. ఏని జపియింప నమృతమై యొసఁగు చుండు
నేది సద్ధర్మపథ మని యెఱుఁగఁ దగిన
దదియె సద్భక్తియోగంబు నావహించు
మూర్తిమంతంబు దా హరికీర్తనంబు 71

సీ. ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్ గేలిమై హరినామకీర్తనములు
సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ గేలిమై హరినామకీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ గేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనితతపఃఫలసారముల్ గేలిమై హరినామకీర్తనములు

తే. పుణ్యమూలంబు లనపాయపోషకంబు
లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ
లార్తశుభములు హరినామకీర్తనములు 72

సీ. దారుణపాపకాంతారంబునకు నగ్నికీలలు హరినామకీర్తనములు
గురుకల్మషానీకకూర్మగసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు
తీవ్రపాతకగాఢతిమిరంబునకు సూర్యకిరణముల్ హరినామకీర్తనములు
ఘోరకిల్బిషమదకుంజరసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు

తే. మహితయోగోగ్రనిత్యసమాధివిధుల
నలరు యోగీంద్రవరులకు నలవి కాని
భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య
ఖేలనంబులు హరినామకీర్తనములు 73

క. దురితవిదూరుని మంగళ
చరితామృత మాత్మఁ గ్రోలుజనుఁ డితరకథా
గరళము గోరునె? హరిసం
స్మరణము జీవులకు నఖిలసౌఖ్యద మరయన్ 74

మ. నిరతం బై నిరవద్య మై నిఖిలచిన్నిర్మాణ మై నిత్య మై
నిరహంకారగుణాఢ్య మై నియమమై నిర్దోష మైనట్టి శ్రీ
హరినామస్మరణామృతం బెవఁడు ప్రత్యక్షంబు సేవించునో
మరణాంతంబున నట్టిసజ్జనునిధర్మం బేల స్వర్గం బగున్? 75

తరల. హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁ డై
పొరలుచుండెడివట్టి ముక్తికిఁ బోవ నేర్చునె? వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు; సత్య మాహరినామసం
స్మరణ మొక్కముహూర్తమాత్రము చాలు ముక్తిద మారయన్ 76

క. కులహీనుఁడు నారాయణ
విలసత్కథనములు గడఁక వినిపించిన డ
త్కులహీనతఁ బాసి మహో
జ్జ్వలకులజత్వమును బొందు సజ్జనుఁ డగుచున్ 77

ఉ. కూలినచోటఁ, గొట్టుపడి కుందినచోట, మహాజ్వరాదులం
జేరినచోట, సర్పముఖపీడల నంటినచోట, నార్తు లై
తూలినచోట, విష్ణు భవదూరునిఁ జేర్కొని లేని మీఁద న
క్కాలునియాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్ 78

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు సత్ప్రాంతంబుఁ గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యు లౌదురు గదా తత్త్వజ్ఞు లై నిత్యమున్ 79

# భగవత్సేవ

క. పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళప్రాభవసం
జీవనములు మునిజనసం
భావనములు దేవదేవుపదసేవనముల్ 80

క. పురుషుండు దవిలి చతుర్విధ
పురుషార్థశ్రీయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదసేవనము దక్క నన్యము గలదే? 81

క. చెడుఁ గరులు హరులు ధనములుఁ
జెడుదురు నిజసతులు సుతులుఁ జెడుచెనఁటులకుం;
జెడక మనునట్టిగుణములకుఁ
జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్ 82

ఉ. ఇంచుక మాయ లేక మది నెప్పుడుఁ బాయనిభక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁ డేని హరిదివ్యపదాంబుజసేవనంబు గా
వించు నతం డెఱుంగును బవిత్రమునీంద్రుల కైన దుర్లభో
దంచిత మైనయాహరియుదారమహోద్భుతసత్ప్రభావముల్ 83

సీ. చర్చింప నరుల కీజన్మకర్మాయుర్మనోవచనంబుల దేవదేవుఁ
డఖిలవిశ్వాత్మకుం డైనసర్వేశుఁడు విలసిల్లు భక్తి సేవింపఁబడిన
నవియ పో జన్మకర్మాయుర్మనోవచనములవ ధరణి నెన్నంగఁ దగును
బరమేశపాదసేవారహితము లైనజన్మనోవచనాయురాదికృతంబు

తే. లైనజన్మంబు లేల? దీర్ఘాయు వేల?
వేదచోదిత యాగకర్మవితతి యేల?
జపతపశ్శ్రీతవాగ్విలాసంబు లేల?
మహితనానావధానసామర్థ్య మేల? 84

# భగవద్భక్తి

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువుల,
చిక్కఁడు దానముల శౌచశీలతపములం,
జిక్కఁడు యుక్తిని; భక్తిని
జిక్కనిక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ. 85

క. చాలదు భూదేవత్వము
సాలదు దేవత్వ మధికశాంతత్వంబున్
జాలదు భూరితపంబును
జాలదు హరిఁ దనుప భక్తి సాలినభంగిన్. 86

మ. తపమున్ వంశముఁ దేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగమున్
నిపుణత్వంబుఁ బ్రతాపపౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్
జపహోమక్రతువుల్ దలంప భగవత్సంతుష్టికిఁ జాల వ
చ్చపుచిత్తంబున భక్తి సేయవలయున్ సంతోషసంయుక్తుఁడై. 87

మ. ఉపవాసవ్రతశౌచశీలముఖసంధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి సేకూర ద
చ్చపుభక్తిన్ హరిభక్తలోకవరదున్ సర్వాతిశాయిన్ బరా
ధిపుఁ బాపఘ్ను ననంతు నచ్యుతుని నర్థిం గొల్వ లే కుండినన్. 88

మ. అమలజ్ఞానసుదానధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోనసూయలఁ గడున్ దర్పింపమధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మముల్
సమతిన్ భక్తి నయించె నేని భగవత్సంతోషకుం డౌఁ దుదిన్ 89

సీ. అరయ నారాయణుం డఖిలశాస్త్రములను సమధికానుష్ఠితసవనతీర్థ
దర్శనజపతపోధ్యయనయోగక్రియాదానకర్మంబులఁ గానఁబడక
యేచినభక్తి బాహ్యేంద్రియంబుల గెల్చి సకలకర్మత్యాగసరణి నొప్పి
తలకొని యాత్మతత్త్వజ్ఞానమున మించి యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి
తే. మహితఫలసంగరహితధర్మమున నలరి। యఖిలహేయగుణంబుల నవలఁ ద్రోసి
సకలకళ్యాణగుణగణసహితుఁ డైన। యట్టినరునకుఁ గాన్పించు నధికకరుణ 90

ఆ. కర్మతంత్రుఁ డగుచు నిర్మలుఁ గొల్చుచు
మద్భయనియతవృత్తి నుండెనేని
చెడును గర్మ మెల్ల శిథిలమై యెల్లనఁ
బ్రబలమైనవిష్ణుభక్తి యెడను 91

శా. అంధేంద్రాదయముల్, మహాబధిరశంఖారావముల్, మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్, నపుంసకవధూకాంక్షల్, కృతఘ్నావలీ
బంధుత్వంబులు, భస్మహవ్యములు, లుబ్ధద్రవ్యముల్, క్రోధస
ద్గ్రంథంబుల్ హరిభక్తివర్జితులభక్తవ్యర్థసంసారముల్ 92

చ. అనిశము సర్వభూతహృదయాంబుజవర్తి యనం దనర్చు న
య్యనఘు నవజ్ఞసేసి పరుఁ డజ్ఞతఁ దాఁ బ్రతిమార్చనావిడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నీశు భజింపఁడేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చినయట్టివాఁ డగున్. 93

చ. ఎనసినభక్తియోగమున నీశ్వరదివ్యపదాబ్జ మొందఁగా
ననయముఁ గోరువాఁడు పటులాగ్రహభీషణవీర్యశౌర్యత
ర్జనములచే వనూనగతి సర్వజగంబులు సంహరించున
య్యమసముఁడైనకాలునిభయంబును బొందఁడు కుందఁ డెప్పుడున్. 94

మ. కలలోనం దను మున్నెఱుంగనిమహాకష్టాత్ముఁడై వట్టిదు
ర్బలుఁ డాపత్సమయంబునన్ హరిపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలపం దోడన మెచ్చి యాశ్రితహరుఁడై తన్నైన నిచ్చుఁగా నని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సాయుజ్యసామ్రాజ్యముల్ 95

సీ. అజ్ఞుండు సేసినయపరాధములను జేపట్టఁ డీశ్వరుండు కృపాళుఁ డగుటఁ
జేపట్టు శోకచోట సిద్ధ మీశ్వరునకు నర్థంబు లే కుండు నతఁడు పూర్ణుఁ
డై యర్థముల నీశ్వరార్పణంబులు గాఁగఁ జేయుట ధర్మంబు సేసె నేని
నద్దంబు జూచిన నళికలలామంబు ప్రతిబింబితం బగుపగిది మరల

తే. నర్థములు దోఁచుఁ గావున నధికబుద్ధి! భక్తి సేయంగవలయును భక్తి గాని
మెచ్చఁ డర్థంబు లొసఁగెడు వారలందుఁ! బరమకరుణుండు హరి భక్తిబాంధవుండు

# ఉద్బోధన

సీ. హరినామకథనదావానలజ్వాలచేఁ గాలవే ఘోరాఘకాననములు
పరమాత్మసన్నవవాయుసంఘంబుచేఁ దొలఁగవే భవదుఃఖతోయదములు
కరుణానిధిధ్యానకంఠీరవంబుచేఁ గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ దీఱవే షడ్వర్గతిమిరతతులు
ఆ. దేవదేవుభక్తినావచేఁ గాక సం
సారజలధి దాటి చనఁగ రాదు
వేయుమాట లేల విష్ణుప్రభావంబు
సాటి వేఱొకండు జగతిఁ గలదె. 97

సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే స్వామిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ను లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పరమేశనుతిరవిప్రభలు లేక
తే. నిరుపమాపునరావృత్తినిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
సర్వరంజనుచింతనాంజనము లేక
పరమయోగీంద్రులకు నైన వరసి చూడ. 98

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలుమధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగురాయంచ పనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక మరుగునే సాంద్రనీహారములకు
తే. నాదిదేవునిదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు
వేఱె చెప్పఁగ మాటలు వేయు నేల. 99

సీ. పరమేశు నర్చించుకరములు కరములు, శ్రీకరు వర్ణించుజిహ్వ జిహ్వ
సుజనరక్షకుఁ జూచుచూడ్కులు, చూడ్కులు కరుణామయుని మ్రొక్కుశిరము
విష్ణు వాకర్ణించువీనులు వీనులు, మునివంద్యుఁ దవిలినమనము మనము [శిరము
భగవంతు వలగొనుపదములు పదములు, పురుషోత్తమునిమీఁదిబుద్ధి బుద్ధి
తే. దేవదేవునిఁ జింతించుదినము దినము
సర్వశక్తునిఁ బ్రకటించుచదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురువు గురువు
దైవతము చేరు మనియెడితండ్రి తండ్రి 100

సీ. కరుణాత్మునకుఁ గానికాయంబు కాయమే పవనగుంఫితచర్మభస్త్రి గాక
పరమేశుఁ బొగడనివక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడిఢక్క గాక
హరిపూజనము లేనిహస్తంబు హస్తమే తరుశాఖనిర్మితదర్వి గాక
కల్యాణుఁ జూడనికన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములు గాక
ఆ. స్వామిచింత లేనిజన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేనివిబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడిపశువు గాక 101

సీ. నారాయణునిదివ్యనామాక్షరములపైఁ గరఁగనిమనములు కఠినశిలలు
సదయాత్మకథలకు ముదితాశ్రురోమాంచమిళిత మై యుండనిమేను మొద్దు
జగదీశు మ్రొక్కనిజడునియాదల నున్నకనకకిరీటంబు కట్టెమోపు
ఈశ్వరార్పితముగా వెసఁగనివరుసిరి వనదుర్గచంద్రికావైభవంబు
ఆ. సలలితాత్మభజన గలిగి యుండనివాఁడు
గాలిలోన నుండి కదలుశవము
కలుషరహితుపదముఁ గననివానిబ్రదుకు
పసిఁడికాయలోనిప్రాణిబ్రదుకు 102

చ. హరి భజియించుహస్తములు హస్తము, లచ్యుతుఁ గోరి మ్రొక్కుత
చ్ఛిరము శిరంబు, విశ్వకరుఁ జేరినచిత్తము చిత్త, మీశ్వరే
శ్వరుఁ గనుదృష్టి దృష్టి, మునివంద్యు నుతించినవాణి వాణి, య
శుభకథ లానుకర్ణములు కర్ణము లై విలసిల్లుఁ బో భువిన్ 103

సీ. విష్ణుకీర్తనముల వినని కర్ణంబులు కొండలబిలములై యుండ కున్నె
సర్వేశుపద్యముల్ జదువనిజిహ్వలు గప్పలజిహ్వలై యొప్ప కున్నె
చిన్మయాకారు నీక్షింపనికన్నులు నెకిపింఛాక్షులు కాక యున్నె
కరుణాత్మపూజకుఁ గానిహస్తంబులు శవముహస్తంబులై చనక యున్నె
ఆ. ముక్తిదాయకునకు మ్రొక్కని శిరములు
వానరశిరము లయి వాల కున్నె
పతితపావనునుతిగతి లేనిపదములు
పాదపపదము లయి పరగ కున్నె. 103

సీ. అలరుజొంపములతో నభ్రంకషంబులై బొదుగవే వనములఁ బాదపములు
ఖాదనమేహనాకాంక్షలఁ బశువులు జీవింపవే గ్రామసీమలందు
నియతిమై నుచ్ఛ్వాసనిశ్వాసపవనముల్ పాలింపవే చర్మభస్త్రికలును
గ్రామసూకరశునకశ్రేణు లింటింటఁ దిరుగవే దుర్యోగదీనవృత్తి
తే. సృష్టికరములు బోవవే యూరుభరములఁ
బరమపురుషుని దెలియఁగనిపురుషపశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ
విషయాభరయుక్తితో నుంట విఫల మగయ. 104

సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండువానికై వల్య మెన్నటికి లేదు
పతితపావనుభక్తవరుల సేవించినవానికైవల్య మెన్నటికి లేదు
పరమాత్మనిర్మలనిశ్చయుం డైనట్టివానికైవల్య మెన్నటికి లేదు
ప్రవిమలాత్మనికథాశ్రవణలోలుం డైనవానికైవల్య మెన్నటికి లేదు
తే. లేదు తపముల బ్రహ్మచర్యాదినియతి
శమదమాదుల సత్యశౌచముల దాన
ధర్మమఖముల సుస్థిరస్థాన మైన
బ్రహ్మవిజ్ఞానజనితనిర్వాణపదము. 105

చ. వరవిశ్వేశకథాసుధారసమహావర్షోరుధారాపరం
పరలం గాక తలంచి చూడ నితరోపాయానురక్తిం బ్రవి
స్తరదుర్దాంతగురంతదుస్సహజనుస్సంభావితానేకదు
స్తరగంభీరకశోకకల్మషకసద్దావానలం బాయునే. 106

గీ. చేతులారంగ శివుని బూజింపఁ డేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁ డేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు 107

క. హరిమహిమ తెలుఁగువారికి
హరిగుణములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడివారికి
మరణాగతమోహసంభ్రమము లే దెందున్. 108

క. హరిదాసుల మైత్రిం గొని
హరిమహిమల నెన్నికొనుచు హర్షముతోడన్
ధరతాఁ బ్రపులకితుం డై
పురుషుఁడు హరిమాయఁ గెల్చి ముక్తిం బడయున్. 109

క. ధర్మము సత్యముఁ గీర్తియు
నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమఘనస
త్కర్మ మహింసావ్రతమును
నర్మిలి గలవారె పుణ్యులవనీస్థలిలో. 110

క. కామింపకయును సర్వముఁ
గామించియు నైన ముక్తిఁ గామించి తగన్
బ్రేమించి పరమపురుషుని
సేవించి భజించుఁ దత్త్వనిపుణుఁడు భక్తిన్. 111

క. మంగళహరికీర్తిమహో
గంగామృత మించు కైనఁ గర్ణాంజలులన్
సంగతము సేసి త్రావఁ దో
లంగును గర్మంబు లావిలం బగుచు వెసన్. 112

క. దేహము నిత్యము గా దని
మోహముఁ దెగఁ గోసి సిద్ధమునియై యఘసం
దోహము వెలుపడి నరుఁ డు
త్సాహమునం జెలఁగి ముక్తిసంపద నొందున్. 113

కం. ఎందాక నాత్మ దేహము
నొందెడు నందాక కర్మయోగము లటపైఁ
జెందవు మాయాయోగ
స్పందితు లై రిక్త జాలిఁ బడ నేమిటికిన్. 114

ఉ. ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలన్
ద్రెళ్లక వీరు నే మనుమతిభ్రమణంబున భిన్ను లై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతనిదివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రెలమి నుండుట మేలు తలంచి చూడఁగన్. 115

ఉ. అచ్చపుఁజీకటిం బడి గృహావ్రతు లై విషయప్రవిష్టు లై
చచ్చుచుఁ బుట్టుచున్ మగలఁ జర్వితచర్వణు లైనవారికిన్
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిన నైన నిజేచ్ఛ నైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరిప్రబోధముల్. 116

ఉ. కానని వానినూఁత గొని కానని వాఁడు విశిష్టవస్తువుల్
గానిభంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధు లై
కానరు విష్ణుఁ గొందఱటఁ గందు రకించనదైవతాంఘ్రిసం
స్థానరజోభిషిక్తు లగుసంహృతకర్ములు వీతరాగు లై. 117

ఆ. హృదయము కుదియించి హృతపరిసంగుఁ డై
యింద్రియనిచయంబు నెల్ల మాపి
హరివిశాలరూపమందుఁ జిత్తముఁ జేర్చి
నిలుపవలయు బుద్ధి నెఱపి బుధుఁడు. 118

చ. మది నొకయింతమాత్రన సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం
గదిసినయింద్రియంబుల నొకంతకుఁ దెచ్చి మనంబు వాక్కునం
కుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ గూర్చుచు శాశ్వతవిగ్రహంబు నా
సదయుఁ బ్రశాంతు లోకగురు సన్నుతి సేయుఁడు భక్తితోడుతన్. 119

చ. మదనునిబాణజాలముల మగ్నత నొందక ధైర్యవంతుఁ డై
ముదితలవాడిచూపులకు మోహము నొందక నిశ్చలాత్ముఁ డై
సదమలతేజ నచ్యుతుని శాంతు ననంతు జగన్నివాసునిన్
వదలక మానసాబ్జమున భక్తిఁ దగిల్చి భజింపు టొప్పగున్. 120

సీ. రథము దేహంబు, సారథి బుద్ధి, యింద్రియగణము గుఱ్ఱములు, పగ్గములు మనము,
ప్రాణాదిదశవిధపవనంబు లిరుసు, ధర్మాధర్మగతులు రథాంగకములు,
బహుళతరం బైనబంధంబు చిత్తంబు, శబ్దాదికములు సంచారభూమి,
లభిమానసంయుతుం డయినజీవుఁడు రథి, ఘనశరప్రణవంబు కార్ముకంబు
తే. శుద్ధజీవుండు బాణుండు, శుభద మైన
బ్రహ్మ మంచితలక్ష్యంబు, వైరులు రాగ
భయమదద్వేషశోకలోభప్రమోహ
మానమత్సరముఖములు మానవునకు 121
సీ. పరధనపరదారపరదూషణాదులఁ బరవస్తుచింత దాఁ బరిహరించి
ముదిమిచే రోగము లుదయింప కటమున్న తనువు చంచలతను దగుల కుండ
బుద్ధి సంచలతచేఁ బొదలకయటమున్న శ్లేష్మంబు గళమునఁ జేర కుండ
శక్తియుక్తుల మది సన్నగిల్లకమున్న భక్తిభావనచేతఁ బ్రౌఢుఁ డగుచు
తే. నాత్మరంజనుదివ్యపాదారవింద
భజన నిజభక్తిభావనప్రాజ్ఞుఁ డగుచు
నవ్యయానందమునఁ దేలియాడు నెవ్వఁ
డతఁడు కర్మవిముక్తుఁ డై యందు ముక్తి. 122
ఉ. ఏను మృతుండ నౌదు నని యింత భయంబు మనంబులోపలన్
మానుఁడు సంభవంబు గలమానవకోటికిఁ జావు నిత్య మౌఁ
గాన హరిం దలంపుఁ డిఁకఁ గల్గదు జన్మము మీకు ధాత్రిపై
మానవులార పొందెదరు మానుగ శాశ్వతసౌఖ్యసంపదల్. 123
ఆ. విషయసక్తు లైనవిబుధాహితులతోడి
మనికి వలదు ముక్తిమార్గవాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁ గూడి సంతతంబు 124
క. ఆడుదము మనము హరిరతిఁ
బాడుద మేప్రొద్దు విష్ణుభద్రయశంబుల్
వీడుదము దుష్టసంగతిఁ
గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్. 125

క. విత్తము సంసృతిపటలము
వ్రిత్తము కామాదివైరివర్గంబుల చేఁ
డిత్తము చిత్తము హరికిన్
జొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్. 126

క. బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు నీకు నాకు వరయోగులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టివిభుఁడు బల మగు మనకున్. 127

క. దిక్కులు గాలముతో నే
దిక్కన లే కుండఁ గలుగు దిక్కుల మొదలై
దిక్కు గలలేనివారికి
దిక్కెయ్యెడువాఁడు మనకు దిక్కగు నెపుడున్ 128

క. పాలింపుఁడు శేముషి ను
న్మాలింపుఁడు కర్మబంధముల సమదృష్టిన్
జాలింపుఁడు సంసర్గముఁ
గీలింపుఁడు హృదయమందుఁ గేవలభక్తిన్. 129

సీ. సతతంబు నీనునిసంకీర్తనంబులు వీనుల కింపుగా వినఁగ వలయు
హర్షంబుతోడుత హరినామకథనంబు పాటల నాటలఁ బరఁగ వలయు
నారాయణునిదివ్యనామాక్షరంబులు హృద్వీధి సతతంబు నింప వలయుఁ
కల్యాణలీలలు కాంతారముల నైన భక్తియుక్తంబుగాఁ బాడ వలయు
తే. వెట్టిమాళ్కిని లీలతో విశ్వమయుని
నొడువుమను లోకబాహ్యత నొంద వలయు
నింతయును విష్ణుమయ మని యెఱుఁగ వలయు
శేవ మొనరించిన నరుఁడు ఖేద మొందు. 130

ఆ. అరయఁ దనముజిహ్వ హరి[illegible] నుడువదు
చిత్త మతనిపాదచింతఁ [illegible]
తలఁపఁ దమకు ముక్తి తంగేటిజా న్నొకో
సకలవిష్ణుభక్తులకును బోలె 131

క. మందునకు మందబుద్ధికి
సుందారోగ్య ప్రజకు నిరర్థమార్గములఁ జిదా
నందచరణారవిందము
లందముగఁ గొనఁ దొఱపి లేదు రాత్రిందినముల్. 132

మత్త. ఎండమావులఁ గంటిభద్రము లెల్ల సౌఖ్యము లందు మ
ర్త్యుండు రోగనిధానదేహముతో విరక్తుఁడు గాక యు
ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁ డై యొకనాఁడు జే
రండు పారము దుష్టసౌఖ్యపరంపరాక్రమణంబునన్. 133

మ. చెలియే మృత్యువు, చుట్టమే యముఁడు, సంసేవార్థులే కింకరుల్,
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను, దృఢమే జీవంబు నోఁ జెల్లరే
వలెనం బొట యెఱుంగ కీకపటసంసారంబు నిక్కంబు గాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁ డై. 134

చ. అభవు నమేయు నవ్యయు ననంతు ననాదిఁ దూని మేనిలో
నుభయము లైన సంగుఫురుషార్థముఁ గానరు చిత్తశక్తవా
గ్విభవగరిష్ఠు లై వెదకి వీతిసిపాళిఁ ఇల సర్వవస్తువుల్
శుభగతిఁ జూడ నేర్చి తను జూడఁగ నేరనికంటిపోలికన్. 135

చ. ఎనయఁగ జారకామిని నిజేశుని మెచ్చిలి జారపూరుషుం
దనపతి గాఁ దలంచి తుదిఁ దాఁ జెడుకైవడి మూఢచిత్తు లై
యనుపమతేజుఁ డైనపరమాత్ముని నీశ్వరునిం దలంప క
న్యుని భజియించువా రిహపరోన్నతసౌఖ్యము లంద రెప్పుడున్. 136

ఉ. జగదధినాథుఁ డైనహరిసంతతలీలలు సత్ప్రభావముల్
పగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్
మిగిలి కుతర్కవాది దగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే
యగణితవిగ్రహక్రమము వజ్ఞుఁ డెఱింగి నుతింప నోపునే. 137

మ. అవివేకాసుగతస్వకార్యజలవేలాకీర్ణ మై మిత్రాం
ధువధూపుత్రజలగ్రహోగ్రయుత మై దుర్గాంతసంసారదు
ర్భవపాథోధిఁ దరించువారు హరిసంబంధక్రియాలోలభా
గవతానుగ్రహవాప్తి లేనియధముల్ గారే వితర్కింపఁగన్. 138

చ. విపులగుణోత్తరుండు సురవిక్రముఁ డైనహరిన్ భజించి త
చ్ఛ్రవణలసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్
విని ముద మందుచుందురు వివేకవిహీనత నూరబంది యా
త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషము మెక్కు చాడ్పునన్ 139

చ. ఎఱిఁగెడువాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ నెఱుంగుఁ దాను మది నేయపుఁ జూపు గుణానురక్తుఁడై
తెఱకువ లేక క్రిమ్మరుచు దేహధనాద్యభిలాషయుక్తుఁడై
యెఱుఁగనివాఁడు దాఁ దెలియఁ డీశ్వరలీలలు వేయు నేటికిన్. 140

మ. హరికళ్యాణపదారవిందమకరందాసక్తులై యున్నస
త్పురుషశ్రేష్ఠులసూక్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి దు
ర్నరవార్తాకథనప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచు చుండఁ జన దీసంసారమోహంబునన్ 141

సీ. పరమేశ్వరశ్లోకవార్త లాలించుచుఁ గాల మేపుణ్యుండు గడపు చుండు
నతనియాయువుఁ దక్క యన్యులయాయువు నుదయాస్తమయముల నుగ్రకరుఁడు
పంచించి కొనిపోవు వాఁ డది యెఱుఁగక జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు
నంగనాపుత్రగేహారామచిత్తాదిసంసారహేతుకసంగసుఖముఁ

తే. దగిలి వర్తింపఁ గాలంబు తటి యెఱింగి
మృత్యురూపము డై వచ్చి మించి మోస
చేసి కొనిపోవఁ బుణ్యంబు సేయ నైతిఁ
బాపరతి నైతి నని బిట్టు పలవరించు 142

తే. కలఁడు జగదేకసన్నుతకారణుండు
స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు
ఘనుని నాతని సేవింపఁ గలుగుఁ గాని
గలుగునే ముక్తిపదము దుష్కర్మగతుల 143

క. పరికింపఁగ నేమనుజుఁడు
హరిపదమును బొందఁ జేయునట్టివివేక
స్ఫురణం దనర్చు వానికిఁ
బరువడి నిలఁ బొంద రానిపదముం గలదే 144

క. కరణత్రయంబుచేతను
పరఁ జేకర్మంబు సేయఁ బర్యాప్తిగఁ
హరి కర్పణ మని పలుకుట
పరువడి సుజ్ఞాన మంత్రి పరమమునీంద్రా 145

మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణముఁ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుం సంకీర్తనల్ చింతనం
బనునీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁపన్ సౌఖ్యంబు సేకూరెడిన్ 146

క. కోరినవారల కెల్లను
చేరువ కైవల్యపదము శ్రీహరిని మదిం
గోరనివారల కెల్లను
దూరము మోక్షాప్తి యెన్నితోవల నైనన్ 147

క. గురుభక్తిఁ జొత్త మీశ్వర
పర మై ఖిలసిల్లునంతపర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ
జిరతర మోక్షోదయంబు సేకుఱు నండున్ 148

చ. మృదుగతిఁ బువ్వుఁ దేనియ రమించుచుఁ బానము సేయఁ బాఱు ష
ట్పదమును బోలి యార్తజనబాంధవు విశ్వభవస్థితివ్యయా
స్పదమహితావతారుఁ డగుపాపవిదూరుని నిత్యమంగళ
ప్రదగుణకీర్తనామృతముఁ బాయక గ్రోలి లభింతు సౌఖ్యముల్ 149

సీ. అఖిలభూతములందు నాత్మరూపంబున నీశుఁడు హరి యుండు నెల్లప్రొద్దు
బుద్ధ్యాదిలక్షణంబులఁ గానఁబడును మహాత్సేవనీయుఁ డహర్నిశంబు
వందనీయుఁడు భక్తవత్సలుం డత్యంతనియతుఁడై సతతంబు నియతబుద్ధి
నాత్మరూపకుఁ డగుహరికథామృతమును గర్ణపుటంబులఁ గాంక్ష దీర

తే. గ్రోలుచుండెడుధన్యులు కుటిలబహుళ
విషయమలినీకృతాంగముల్ వేగ విడిచి
విశ్వరూపునిచరణారవిందయుగము
గడకుఁ జనియుందు రెప్పుడు విడువకుండ 150

సీ. ఆత్మవేత్తకుఁ బరమాత్మస్వరూపంబు నెఱుఁగఁగఁబడు నది యె ట్లటన్న
గగనస్థుఁ డగుదినకరుకిరణచ్ఛాయ జలముల గృహకుడ్యజాలకముల
వలనఁ దోఁచినప్రతిఫలితంబుచేత నూహింపఁగఁబడినయయ్యినునిపగిది
నర్థి మనోబుద్ధ్యహంకరణేంద్రియనాడీప్రకాశమునను నెఱుంగ
తే. వచ్చునాత్మస్వరూపంబు వలఁతి గాఁగ
జిత్తమునఁ దోఁచునంచితశ్రీఁ దనర్చు
యమ్మహామూర్తి సర్వభూతాంతరాత్ముఁ
డగుట నాత్మజ్ఞులకుఁ గాన నగును సువ్వె 151
చ. హరివిముఖాత్ము లన్యవిషయాదృతచిత్తులుఁ బాపవర్తులున్
నిరయనిపాతహేతువును నింద్యచరిత్రము నైనదుష్కథా
నిరతి జపించువారలును నేరరు పొందఁగ నాజగన్మనో
హరచరణారవిందభజనాత్మకు లొందెడుముక్తి నారయన్ 152
చ. హరిఁ బరమేశుఁ నచ్యుతు ననంతు భజింపఁగ ధర్మతత్త్వధీ
పరిణతిసాధనం బగుస్వభావముఁ దాల్చినమర్త్యు లమ్మహా
పురుషవరేణ్యుమాయను విమోహితమానసులై తదంఘ్రిపం
కరుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్ 153
చ. నిరుపమతేజుఁ డైనహరినిర్మలదివ్యకథానులాపని
ర్భరపరితోషబాష్పకణబంధురచారుకపోలగద్గద
స్వరపులకీకృతాంగు లగువారలు నిస్పృహచిత్తు లత్యహం
కరణవిదూరు లుందురు సుకర్ములయుండెడిపుణ్యభూములన్ 154
చ. సరసగతిన్ మునీంద్రులు ప్రసన్నశరీరహృషీకమానస
స్ఫురణ గలప్పు డవ్విభునిభూరికళాకలితస్వరూపమున్
దర మిడి చూతు రెప్పుడుఁ గుతర్కకృతమోగతిచేత నజ్ఞతం
బొరసినయప్పు డవ్విభునిమూర్తిఁ గనుంగొనఁ జాల రెన్నఁడున్ 155
చ అనుపమభక్తి నీశ్వరపదాంబుజ మెవ్వఁడు మందిరంబుగా
ననయముఁ బొందు వాఁడు నిహతాఖిలభూరిమహోమలుండు స
ద్వినుతవిరక్తిబోధధృతివీర్యవిశేషసమన్వితుండు దా
ననఁ దగి భూరిసంసృతి మహత్తరదుఃఖము నందఁ డెన్నఁడున్ 156

ఉ. గానవిలోలుసంతతజగత్స్తవనీయకథాసుధారసం
బానినయట్టిజిహ్వ యసదన్యకథాలవణోదకంబులం
బానము సేయఁ జూచునె సుపర్వమహీజమరందపానలా
భానుభవంబు నొందుమధుపం బది వోవునె వేపచెట్లకున్ 157

ఉ. కారణకార్యహేతువు జగత్ప్రభు వాతనికంటె నన్యు లె
వ్వారును లేరు కాంతు భగవంతు ననంతుని విశ్వభావనో
దారునిసద్గుణావళు లుదాత్తమతిం గొనియాడ కుండినం
జేరవు చిత్తముల్ పరిష్కృతిఁ జెందనినిర్గుణ మైనబ్రహ్మమున్ 158

చ. క్రమమున మింటికై యెగయఁ గాక విహంగము మింటికైనపా
రము గన నేర్చునే హరిపరాక్రమ మూపినయంతఁ గాక స
ర్వము గ్రహియింప నెవ్వఁడు ప్రవర్తిలుఁ డా జనులార మీరుచి
త్తములకు నెంత గానఁబడుఁ దప్పక యంతయుఁ జేకొనం దగున్ 159

చ. హరి నిజదాసకోటికిఁ దదాశ్రయులై రమియించునట్టిస
త్పురుషుల కిష్టవస్తుపరిపూర్ణమనోరథసిద్ధిఁ గూర్చు ను
స్థిర మగుమన్నముక్తియును సిద్ధముగా నొడఁగూర్చు నన్న న
స్థిరతరతుచ్ఛసౌఖ్యములసిద్ధికి నై మతి వేఁడ నేటికిన్ 160

# వందనము.

క. శ్రీపంబులు ఖండితసం
తాపంబులు గల్మషాంధతమసమహోద్య
ద్దీపంబులు పాషండదు
రాపంబులు విష్ణువందనాలాపంబుల్. 161

ఉ. ఆతత సేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు సర్వలోకజనసౌఖ్యవిధాతకు ధర్మమార్గని
ర్ణేతకుఁ బుణ్యయోగిజననేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్. 162

ఉ. దాతకు భక్తలోకవరధాతకుఁ బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహితదాతకు నిర్మలధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవనేతకు సర్వజయుజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజనభావవిధాతకు భక్తి మ్రొక్కెదన్. 163

ఉ. ఆదర మొప్ప మ్రొక్కెదను నాశ్రితలోకఘనానురాగసం
పాదికి దోషభేదికి ప్రపన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి సత్యవాదికి నశేషజగజ్జననందవేదికిన్
వేదవధూమణీహృదయవీధివిహారలసత్ప్రమోదికిన్ 164

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజా
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచు నుండు నట్టిహరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై 165

మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థానసం
హరణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతి యై
వరయోగిప్రముఖాదిమానవులకుం బ్రాపింప రాకుండుదు
స్తరమార్గంబునఁ దేజరిల్లుహరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. 166

ఉ. ఏవిభువందనార్చనము లేవిభుచింతననామకీర్తనం
బేవిభులీల లద్భుతము లెవ్వఁడు సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నండ్రు నే
నావిభు నాశ్రయించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్. 167

ఉ. ఏపరమేశుపాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలబుద్ధిలో నుభయలోకములందులజడ్డుఁ బాసి యే
తాపము లేక నిశ్చలతఁ దారు గతశ్రము లై చరింతు రే
నాపరమేశు మ్రొక్కెద నఘౌఘనివృత్తుదు భద్రకీర్తిదున్ 168

చ. తపములఁ జేసి రైన మఱి దానము లెన్నియుఁ జేసి రైన నే
జపములఁ జేసి రైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్ప కున్న హే
యపదము లై దురంతవిపదంచితరీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్. 169

మ. యవనవ్యాధపుళిందహూణకశకంకాభీరచండాలసం
భవులుం దక్కినయెల్లమానవులు నేభద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతను లై కల్యాణు లై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదుహృదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్. 170

మ. తపముల్ సేసిననో మనోనియతినో దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్టు ల
బ్ధపడుం డౌ నని తత్వవేత్త లెపుడున్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుం డౌఁ గాక నా కెప్పుడున్ 171

మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో భిన్నుఁడో
గుణుఁడో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వమా
ర్గణు లై యేవిభుపాదపద్మభజనోత్కర్షంబులన్ దత్త్వవి
త్క్షణముం జేసెద రట్టివిష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్. 172

ఉ. మానఘనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మ భయంబులఁ బాసి ముక్తు లై
లూనత నొందరట్టిమునిలోకశిఖామణికిన్ విశంకటా
జ్ఞానతమోనభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్. 173

మ. పరమాత్ముం డజుఁ డీజగంబుఁ బ్రతికల్పంబందుఁ గల్పించుఁ దాఁ
బరిరక్షించును ద్రుంచు నట్టియనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ
ద్భరితున్ గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్. 174

ఉ. పూని మనంబునుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులుం
బ్రాణములున్ వివేకగతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగ నేర వాగుణనికాయములం బరికించునట్టిస
ర్వానుగతున్ సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్. 175

మ. ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే
దనముం జేయుదురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్ప్రవీ
ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నత్యంతతో నవ్యయా
త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై 176

మ. ఘనులై యెవ్వనిపాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధనిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు రాదివ్యమూ
ర్తి నవాఙ్మానసగోచరున్ శుభకరున్ దేజోమయున్ గొల్చెదన్. 177

చ. అనఘులు నిర్జితేంద్రియులునైన సనందనముఖ్యయోగు లెం
దనయము దీర్ఘకాలసముపార్జితయోగసమాధిఁ జేసి యె
వ్వనిచరణారవిందములు వారనిభక్తి నెఱుంగు చుందు రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజయ్యుఁ గొల్చెదన్. 178

చ. సుమహితనిత్యముక్తపరిశుద్ధవిబుద్ధసుతత్త్వుఁడై యురు
క్రముఁ డఖిలభూతసత్ప్రకృతికర్మకళంకుఁడు నైనయట్టియు
త్తమచరితుం గృపాకరు సదాత్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి
త్తమునం దలంతుఁ బుణ్యజనతాపరిరక్షణు దుష్టశిక్షణున్ 179

మ. బహుపాదోరుభుజాననేక్షణశిరఃఫాలశ్రవోయుక్తుఁడై
విహరించున్ బహుదేహిదేహగతుఁడై విద్వాంసు లూహించి త
ద్బహురూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు రా
మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యున్ బ్రశంసించెదన్. 180

ఉ. ఏపరమేశ్వరుఁడు జగము లిన్నిటిఁ గప్పినమాయ గప్పఁగా
నేపక పారతంత్ర్యమున నుండు మహాత్మకుఁ డట్టివాని క
ద్దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదారతపోధనచక్రవర్తికిన్. 181

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 182

క. ఒకపరి జగములు వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగున
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్ 183

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 184

క. నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁ డాడు మునులు విబుధులుం
గీర్తింప నేర రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ రట్టివాని నుతింతున్ 185

ఆ. ముక్తసంగు లైనమునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు 186

క. యోగాగ్నిదగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము నొం డెఱుఁగక స
ద్యోగవిభాసితమనముల
బాగుగ వీక్షింతు రట్టిపరము భజింతున్. 187

సీ. శాంతున కపవర్గసౌఖ్యసంధాతకు నిర్వ్యాజభక్తరక్షు నిర్విశేషు
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి
ఆ. సెటి నసత్య మనునీడతో వెలుఁగుచు
నుండునెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 188

సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గమయునికి నుత్తమమందిరునకు
సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ దనయంత రాజిల్లునన్యమతికి
గుణలవోద్దీపితగురుమానసునకు సంవర్తికకర్మనిర్వర్తితునకు
దిశ లేవినాబోఁటిదీనులపాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ
ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ
వంతునకుఁ దనూజవశునివేళ
దారసక్తులైనవారి కందఁగరాని
వాని కావరింతు వందనములు. 189

సీ. వరధర్మకామార్థవర్జితకాము లై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షింపువారి కవ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వాని మునుకొని చింతింతు రానందవార్ధిమగ్నాంతరంగు
లేకాంతు లెవ్వాని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుండు
ఆ. రామహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మ మయినవానిఁ బరుని నతీంద్రియు
నీశు దూరు సూక్ష్ము నే భజింతు. 190

క. విశ్వాకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్. 191

సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల నెబ్భంగి నెగడింతు ర ట్లడంతు
రాశియు నాత్మకరావళిచేతను సకలజనంబుల సర్వజంతు
గణముల జగముల ఘనసామరూప భేదములతో మెఱయించి తగ నడంచు
నెవ్వాఁడు మనము బుద్ధీంద్రియంబులుం దాన యై గుణసంప్రవాహంబు నెఱపు
తే. స్త్రీనపుంసకపురుషమూర్తియును గాక
తిర్యగమరనరాదిమూర్తియును గాక
కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక
వెనుక నన్నియుఁ దా నగువిభుఁ దలంతు. 192

క. జననస్థితివిలయంబుల
కనయంబును హేతుభూత మగుమాయాలీ
లను జెంది నటన సలిపెడు
ననఘాత్మకునకు నొనర్తు నభివందనముల్. 193

క. జననస్థితిలయదూరుని
మునినుతు నిర్వాణసుఖసముద్రుని సుగుణుం
దనుతనుని బృథులపృథులుని
ననఘాత్ము మహానుభావు నభినందింతున్. 194

క. శశ్వత్ప్రశాంతు నభయుని
విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్
శాశ్వతు సదసత్పూరుషు
నీశ్వరుఁ జిత్తమునఁ దలఁతు నెంతయు భక్తిన్. 195

క. జీవావలిఁ గల్పించుచు
జీవావలిలోనఁ దగ వసించుచుఁ బ్రియవ
స్త్వావలిలోపలఁ బ్రియవ
స్త్వావలి యై యుండునీశు ననిశముఁ గొలుతున్. 196

తే. వరమునికి వందన మొనర్తుఁ బరిభవించి
ము న్నవితథానుభూతికి మొక్కికొందు
మెఱయు గుణములఁ దేలునిమిత్తమాత్ర
బంధు వైనట్టివానికిఁ బ్రణతు లిడుదు. 197

ఆ. తవిలి గుణులచేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కాన రాని నెలవువాని
మొదలఁ దాన కలిగి ముక్తిమానావధి
రూఢ మైనవానిఁ బ్రాపుఁ గందు. 198

ఆ. ఎల్లతనువులందు నిర వొంది తనలోనఁ
బొందు చేసినట్టిపొందుకాని
పొందు వొంద లేఁడు పురుషుండు గుణము సా
గుణుని బోలినట్టిగుణు భజింతు 199

క. అనుపమగుణసంపూర్ణుని
ననఘుని సుస్థితుని గతుని నానందు ననం
తుని భక్తహృద్గుహాసీ
నుని సర్వేశ్వరుని ఘనుని నుతు లొనరింతున్ 200

తే. తవిలి యాదేవదేవునిభవమహాబ్ధి
తారణంబును మంగళకారణంబు
నఖిలసంపత్కరంబు నై యలరుపాద
వనజమున కే నొనర్చెద వందనములు. 201

తే. అవ్యయుండును సర్వభూతాత్మకుఁడును
సర్వశక్తిధరుండును శాశ్వతుఁడును
విశ్వకరుఁడును గురుఁడును విమలమూర్తి
యయినవానికి నుతించెద నమలభక్తి. 202

సీ. ఎవ్వనిగుణముల నెట్టికోవిదు లైన వినుతింపఁగా లేక వెగడుపడుదు
రెవ్వనిఘనతత్వ మెనయంగ సనకాదియోగిమానసపంక్తి నోలలాడు
నెవ్వనిరూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద మడుచు
నెవ్వనికారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యొంతయు ధన్యతములఁ జేయు
తే. నట్టిసర్వేశుఁ బాపసంహారు ధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మసంపారు నీశుఁ
బ్రవిమలాకారు సంసారభయవిదూరు
భక్తజనపోషుఁ బరితోషుఁ బ్రస్తుతింతు. 203

సీ. భావింప నెవనికి బ్రహ్మాండ మంతయు నాటలబొమ్మరి ల్లనఁగ నుండు
పోలంగ నెవనికి భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతు లనఁగ నుండు
కేళిమై నెవని కఖిలభూతచయములు దనయింటిలో బొమ్మ లనఁగ నుండు
లీలమై నెవనికి నీలోక మంతయు నచ్చటిబొమ్మపీ టనఁగ నుండు
ఆ. పేరిమై నెవనికి నినచంద్రబింబంబు
లచటిదీపకళిక లనఁగ నుండు
నట్టినిత్యఖేలనానందలోలు శ్రీ
లాభిశాలు గొలుతు భావమందు 204

సీ. ఎవ్వనికారుణ్య మెల్లభూతములకు సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు
నెవ్వనిశుభనామ మేప్రొద్దు నుడువంగ సంసారబంధంబు సమసిపోవు
నెవ్వనిచరితంబు హృదయంబుఁ జేర్పంగ భయము నొంది మృత్యువు పరువువెట్టు
నెవ్వనిపాదంబు లెప్పుడు భక్తితో సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ
తే. దపసు లెవ్వనిధ్యానంబుఁ దగిలి యుండి
శాంతి తెరువుఁ గాంచి సుఖింతు రెపుడు
నట్టిశాంతినికేతను నమృతమయుని
సచ్చిదానందు నాత్మలో సంస్తుతింతు. 205

సీ. ఎవ్వనిమాయకు నిరతయు మోహించుఁ దతిమి యెవ్వనిమాయ దాట రాదు
తనమాయ నెవ్వఁ డింతయు గల్పినట్టివాఁ డెవ్వనిఁ బొడగాన రట్టిమునులు
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ దనచేత జనిత మయిన
ధరణి పాదములు, చిత్తము సోముఁ, డగ్ని ముఖంబు, గన్నులు సోమకమలహితులు
తే. నెవులు దిక్కులు, రేతంబు సిద్ధజలము,
మూఁడుమూర్తులపుట్టిల్లు మొదలినెలవు,
గర్భ మఖిలంబు, మూర్ధంబు గగన మగుచు
మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు 206

క. పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ
బరుఁ డవ్యయుఁ డఖిలభూతబహిరంతర్భా
సురుఁడును లోకనియంతయుఁ
బరమేశ్వరుఁ డైనహరికిఁ బ్రణుతు లొనర్తున్. 207

సీ. విమలయోగీంద్రసంఘములకు నెవ్వానియాకారసంస్థాన మాటపట్టు
జనదృక్చకోరకసమితికి నెవ్వానిపాననాస్యము సుధాపానపాత్రి
సకలసజ్జనసమాజములకు నెవ్వానిబాహాదండంబులు పట్టుఁగొమ్మ
లాశ్రితశ్రేణి కేయనఘునిపాదరాజీవయుగ్మంబులు చేయుగడలు
తే. అట్టిలోకైకపూజ్యున కాద్యునకును
సచ్చిదానందమూర్తికి సర్వగతికి
కునకు నాద్యంతశూన్యున కనఘునకును
బ్రణతి గావింతు నెంతయు భక్తితోడ. 208
సీ. ఎవ్వాఁడు నిఖిలభూతేంద్రియామయ మాయామాయావలంబనమహేశకర్త
బద్ధుఁడై వర్తించుచుఁగడి దండవ్యామానం బగుజీవచింతనములందు
నవికారుఁడై శుద్ధుఁడై యఖండజ్ఞానమున నుండువానికి ముఖ్యచరితు
నకు నకుంఠితకారుణ్యునకుఁ బరంజ్యోతికి సర్వజ్ఞునకుఁ గృపాకాంతిమతికి
తే. గడఁగియుఁ బ్రకృతిపురుషులకంటెఁ బరమఁ
డయినవానికి మ్రొక్కెద నస్మదీయ
దుర్భరోదగ్రభీకరదుష్టపాప
తేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు. 209
సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వనివలన నేర్పడు నమవర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రాజగుచుఁ జిత్తమునఁజేసి
విజ్ఞానతేజంబు విదితంబు గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు
ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద
ననఘు సత్యుఁ బరుని ననుదినంబు 210
ఆ. వరద! పరమపురుష! హరి! సచ్చిదానంద!
భక్తదుఃఖనాశ! స్వప్రకాశ!
యవ్యయాప్రమేయ! యనిశంబు గావింతు
భక్తితోడ నీకు వందనములు. 211

ఆ. పరమపురుష! భక్తవరద! స్వతంత్ర! వి
జ్ఞానమయ! మహాత్మ! సర్వపూర్వ
పురుష! నిఖిలబీజభూతాత్మక! బ్రహ్మ!
నీకు వందనంబు నిష్కళంక! 212

తే. నిర్వికార! నిరంజన! నిష్కళంక!
నిరతిశయ! నిష్క్రియారంభ! నిర్మలాత్మ!
విశ్వసంభోద్య! నిరవద్య! వేదవేద్య!
పరివిమలానంద! నీ కివె వందనములు 213

తే. అర్థి భవదీయపాదంబు లాశ్రయింతు
మహితభక్తిని నీకు నమస్కరింతు
భక్తజనపోష! పరితోష! పరమపురుష!
పరివిమలాకార! సంసారభయవిదూర! 214

ఆ. ఆర్తజనుల నమ్ము నరసి రక్షింపు మ
హాత్మ! భక్తజనభయాపహరణ!
నిన్ను మది నుతించి నీకు మ్రొక్కెదము నీ
చరణయుగము మాకు శరణ మనఘ! 215

తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు
భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును
హృదయపద్మమునం దోలి నెలుఁగఁబడిన
యట్టినీకు నమస్కార మయ్య వరద! 216

తే. తవిలి శశ్వత్స్వరూపచైతన్యభూరి
మహిమచేత నపాస్తసమస్త భేద
మోహుఁడ వఖిలవిజ్ఞానమునకు సాక్షి
యగుచు నీకు మ్రొక్కెద శ్రీశ! 217

మ. పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీపూజాదికర్మక్రియా
పరతం జెందనిమాఘచిత్తునిఁ బరిపాలింపుము మహాపాపమున్
జరయున్ నాశము నొందఁ జేయ నతిదక్షం బైనకాలంబు శీ
ఘ్రముగ కాలాత్ముఁడ వైననీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్ 218

## స్తోత్రము.

క. చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు, భవలతాలవిత్రంబులు, స
న్మిత్రంబులు, మునిజనవన
చైత్రంబులు దేవదేవుసంస్తోత్రంబుల్. 219

మాలిని. నిరుపగుణజాలా! నిర్మలానందలోలా!
దురితఘనసమీరా! దుష్టపాపప్రహారా!
సరసవినుతసూరీ! సర్వలోకోపకారీ!
గురుబుధసుఖకర్తా! కుంభినీచక్రభర్తా! 220

మాలిని. భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
పరివిమలగుణజాలా! భక్తలోకానుపాలా!
భవతిమిరదినేశా! భానుకోటిప్రకాశా!
కువలయహితకారీ! ఘోరపాపప్రహారీ! 221

తరల. ధరణిధారణ! సృష్టికారణ! తాపసస్తుతిపారణా!
సరసపోషణ! సత్యభాషణ! సత్కృపామయభూషణా!
దురితతారణ! దుఃఖవారణ! దుష్టతత్త్వవిదారణా!
పరమపావన! విశ్వభావన! భవ్యయోగిజపావనా! 222

క. తారల నెన్నఁగ వచ్చును
భూరేణుల లెక్కపెట్టఁ బోలును ధాత్రిన్
నారాయణ! నీగుణగణ
మారయ వర్ణింప వశమె ప్రాజ్ఞులకైనన్? 223

క. జననము నైశ్వర్యంబును
ధనమును విద్యయును గలమదచ్ఛన్నులకిం
చనగోచరుఁ డగునిన్నున్
వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా! 224

క. సదసత్తత్త్వచరాచర
సదనం బగునిన్నుఁ బొగడ సన్మునివర్యుల్
పెదవులు గదలుప వెఱతురు
వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా! 225

క. ఎఱిఁగినవారియెఱుంగమి
యెఱుఁగమె! బహుభాష లేల? యీశ్వర! నీపెం
పెఱుఁగ మనోవాక్కులకున్
గుఱి సేయం గొలఁది గాదు గుణరత్ననిధీ! 226

మ. అమలుల్, సిద్ధులు, సంయమీశ్వరులు, బ్రహ్మజ్ఞుల్ సతాత్పర్యచి
త్తములన్ నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా
రము ముట్టన్ నుతి సేయ నోప రఁట; యప్రాజ్ఞుండ, మూఢుండ, గ
ర్వమదోద్రిక్తుఁడఁ, బాపుఁడన్, జడమతిన్ వర్ణింప శక్తుండనే? 227

శా. నీపాదాబ్జము మౌనిపూజ్యము గదా! నీసేవ సంసారసం
తాపధ్వంసిని యౌఁ గదా! సకలభద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతు గదా ప్రపన్నులకుఁ గాలాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబుగ దయ్యె; సాలరు నినున్ వర్ణింప నెవ్వారలున్. 228

సీ. భూతాత్మ! భూతేశ! భూతభావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!
యీలోకముల కెల్ల నీశ్వరుండవు నీవ; బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;
యార్తశరణ్యుండ వగుగురుండవు; నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు;
సకలసృష్టిస్థితిసంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరగు దీవు;
ఆ. పరమగుహ్యమైనబ్రహ్మంబు సదసత్త
మంబు నీవ; శక్తిమయుఁడ వీవ;
శబ్దయోని వీవ; జగదంతరాత్మవు;
వీవ ప్రాణ మరయ నిఖిలమునకు 229

క. నీయంద సంభవించును;
నీయందు వసించియుండు నిఖిలజగములున్;
నీయంద లయముఁ బొందును;
నీయుదరము సర్వభూతనిలయము దేవా! 230

సీ. అగ్ని ముఖంబు; పరాపరాత్మక మాత్మ; కాలంబు గతి; రత్నగర్భ పదము;
శ్వసనంబు నీయూర్పు; రసన జలేశుండు; దిశలు గర్ణంబులు; దివము నాభి;
సూర్యుండు గన్నులు; శుక్లంబు సలిలంబు; జఠరంబు జలధులు; సదలు శిరము;
సర్వౌషధులు రోమచయములు; శల్యంబు లద్రులు, మానస మమృతకరుఁడు;
తే. ఛందములు ధాతువులు; ధర్మసమితి హృదయ;
మాస్యసంచయ ముపనిషదాహ్వయంబు
నయిననీరూపు పరతత్త్వ మై, శివాఖ్య
మై, స్వయంజ్యోతి యై యొప్పు నాద్య మగుచు. 231
ఆ. మూఁడుమూర్తులకును, మూఁడులోకములకు,
మూఁడుకాలములకు మూల మగుచు
భేద మగుచుఁ దుది నభేద మై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ పరమపురుష! 232
తే. అవ్యయుండ; వనంతుండ; వచ్యుతుండ;
వాదిమధ్యాంతశూన్యుండ; వఖిలధృతివి;
నిఖిలమం దెల్ల వర్తింతు వీవు దగిలి;
నిఖిల మెల్లను నీయందు నెగడు నీశ! 233
క. పటుఘననీరంధ్రితమః
పటలపరీవృతజగత్ప్రపంచమునకు నె
క్కటిలోచన మై మహితో
త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి ననఘా! 234
క. పరమాణువు మొదలుగఁ గొని
పరమము దుదిగాఁగ మధ్య పరికీర్తనచే
స్థిరుఁడవు త్రియావిదుఁడ వై
పరి సత్యాద్యంతమధ్యసదృశగతుఁడ వై. 235
క. సర్వము నీలోనిది గా
సర్వాత్ముఁడ వాత్మవస్తుసంపన్నుఁడ వై
సర్వమయుఁడ వగునీకును
సర్వేశ్వర! లేవు లోనుసంధులు వెలియున్. 236

తే. ఆత్మవలనఁ గలిగె నమరదేహాదుల
నాత్మకంటె వేఱు లవి యటంచుఁ
దలఁచువాఁడు మూఢతముఁడు గావునఁ జూడ
విశ్వ మెల్ల నీవ వేఱు లేదు. 237

సీ. అట్టిట్టి దనరాని దై, మొద లై, నిండుకొన్న దై, వెలుఁగుచు గుణము లేని
దై, యొక్కచందంబు దై, కల దై, నిర్విశేష మై, క్రియ లేక చెప్ప రాని
దేరూప మని శ్రుతు లెప్పుడు నొడివెడి నారూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మరెండవయర్థంబుతుది జగంబుల వశించఁగఁ బెద్దభూతగణము
ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ నాభూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు సెలువ మగుదు. 238

సీ. యూఁకెఁ బ్రధానపూరుషనాయకుండవు, భగవంతుఁడవు జగత్ప్రభుఁడ వైన
నీకంటె నన్యులఁ గైకొని తగిలినయాత్మలు భవభయం బందుదు రది
గావున నీయాజ్ఞఁ గడవంగ నోడుటఁ జేసి వాయువు వీచు; శిఖి వెలుంగు;
నినుఁడు దపించుఁ; దా నిందుఁడు వర్షించు; భయ మంది మృత్యువు పరువు వెట్టు
తే. గాన విజ్ఞానవైరాగ్యకలిత మైన
భక్తియోగంబునం జేసి పరమపదము
కొఱకు నయోగివరులు త్వచ్చరణభజను
లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు. 239

సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్రూపకస్వరూప!
యఖిలభూతములకు నాత్మయు హేతువు నైనయీశ్వరుఁడ వాద్యంతములకు
మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణ మై యమృత మై భూరిసత్య
మానందచిన్మాత్ర మవికార మాద్య మనన్య మశోకంబు నఖిలగుణము
తే. సంభవస్థితిలయముల సంగరహిత
మైనబ్రహ్మంబు నీవ; నీయంఘ్రియుగము
నుభయసంగవిసృష్టు లై యున్నమునులు
గోరి కైవల్యకాము లై కొల్తు రెపుడు, 240

చ. అనఘా! యొక్కఁడ వయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాదిశ
క్తినికాయస్థితి నీజగజ్జననవృద్ధిక్షోభ హేతువ్రభా
వనిరూఢిం దగు దూర్ణనాభిగతి; విశ్వస్తుత్య! విశ్వేశ! నీ
ఘనలీలామహిమార్ణవంబుఁ గడవంగా వచ్చునే యేరికిన్? 241

సీ. సత్యవ్రతుని, నిత్యు, సంప్రాప్తిసాధనుఁ, గాలత్రయమునందుఁ గలుగువాని,
భూతంబు లైదును బుట్టుచో టగువాని, నైదుభూతంబులం దమరువాని,
నైదుభూతంబులు నడఁగినపిమ్మటఁ బరఁగువానిని, సత్యభాషణంబు
సమదర్శనంబును జరపెడువానిని, నిన్నాశ్రయింతును; నీయధీన
తే. మాయచేత నెఱుక మాలినవారలు
పెక్కుగతుల నిన్నుఁ జేరుకొందు;
తెలియఁగ నేర్చువిబుధు లేక చిత్తంబున
నఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు: 242

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించువారికి ధ్యేయవస్తువు భవద్దివ్యమూర్తి;
యాంచితస్వర్గరాజ్యాభిషిక్తున కైన సమధికస్పృహణీయతముఁడ వీవు;
సద్భక్తియుతభక్తజనములభుండవు; దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ;
వాత్మదర్శనులకు నరయఁ గమ్యుండవు నై యర్థి విలసిల్లు దనఘచరిత!
తే. యిట్టినిఖిలదురారాధ్యు నీశు నిన్ను
నెఱయ సుజనుల కైన వర్ణింపరాదు;
వఱల నెవ్వఁడు పూజించు వాఁడు విడువఁ
జాలు నే? పరమపవిత్ర! సచ్చరిత్ర! 243

చ. అరయఁ సమస్తజీవహృదయంబులయందు వసించి యేక మై
పరఁగి సుహృత్క్రియానుగుణభాసితధర్ముఁడవుం బరాపరే
శ్వరుఁడవు నై తనర్చుచు నసజ్జనదుర్లభ మైనయట్టినీ
స్థిర మగునట్టిభూతదయచేఁ బొడగానఁగ వత్తు వచ్యుతా! 244

క. కొందఱు గలఁ డందురు నినుఁ;
గొందఱు లేఁ డందు రతఁడు గుణి గాఁ డనుచుం;
గొందఱు గలఁ డని లేఁ డని
కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా! 245

క. నీనామవిమలగానము
నానాభవరోగకర్మనాశమునకు ని
దానం బగునౌషధ మిది
కానరు దుష్టాత్ము లకట! కారుణ్యనిధీ! 246

క. ధీమహిత! భవన్మంగళ
నామస్మరణానుకీర్తనము గలహీనుల్
శ్రీమంతు లగుదు రగ్ని
ష్టోమాదిక్రతువాళికంటె శుద్ధులు దలఁపన్ 247

క. నీనామస్తుతి శ్రవణం
బైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
వానికి సరి భూసురుఁడుం
గా నేరఁడు; చిత్ర మిది జగంబుల నరయన్. 248

మ. ఘనలక్ష్మీయుత మై, శుభప్రదము నై, కామాదివిధ్వంసి యై,
సనకాదిస్తుత మై, నిరంతరతపస్సంతప్తపుణ్యాగణీ
వన మై, యెప్పుడు నీకథామృతము దా ప్రీతిం గల్గునే భూరిపు
ణ్యనిరూఢత్వము లేనివారికి? జగన్నాథా! కృపాంబోనిధీ! 249

చ. హరి! భవదుఃఖభీషణదవానలదగ్ధకృపార్తమన్మనో
ద్విరదము శోభనంబున బవిత్రము నై భవత్కథాసుధా
సరిదవగాహనంబునను సంసృతితాపము వాసి క్రమ్మఱం
దిరుగదు బ్రహ్మముం గనినధీరునిభంగిఁ బరాపరేశ్వరా! 250

క. దేహము కారాగేహము;
మోహము నిగళంబు; రాగముఖరములు రిపు
వ్యూహములు భక్తితో ని
న్నూహింపనియంతతడవు నోపరమేశా! 251

క. లంపటము నివారింపను,
సంపదఁ గృప సేయ, జయము సంపాదింపం,
జంపెడివారి వధింపను
సొంపారఁగ నీక చెల్లు సూనృతరూపా! 252

ఆ. నిత్య! నిర్వికార! నిర్మల! నిరవద్య!
అప్రమేయ! వరద! హరి! ముకుంద!
నిన్ను గొలువఁ గంటి; నీకృపఁ గనుగొంటి;
నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి. 253

ఉ. ఏవిభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొంద లేని పెం
ద్రోవఁ జరింతు రట్టిబుధపోషక! నిన్ను భజించుటం బ్రియం
బావృత మయ్యెఁ జిత్తము; కృతార్థత నొందె మనోరథంబు; నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము సర్వరక్షకా! 254

క. దీనులకు య్యాలింపను,
దీనుల రక్షింప, మేలుదీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును
దీనపరాధీన! దేవదేవ! మహేశా! 255

క. విను దఁట జీవులమాటలు;
సను దఁట చనరానిచోట్ల; శరణార్థుల కో
యను దఁట పిలిచిన; సర్వముఁ
గను దఁట; సందేహ మయ్యెఁ గరుణావార్థీ! 256

క. నీదిక్కు గానివారికి
నేదిక్కును లేదు వెదక నిహపరములకున్,
మోదింపఁ దలచువారికి
నీదిక్కే దిక్కు నమ్ము నిఖిలాధీశా! 257

క. నీకంటె నొం డెఱుంగము;
నీకంటెం బరులు గావ నేరరు జగముల్;
నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబుల కెల్ల? నిఖిలలోకస్తుత్యా! 258

తే. నిన్నుఁ గొలువనికరములు నిష్ఫలములు;
నిన్ను నొడువనిజిహ్వ దా నీరసంబు;
నిన్నుఁ గానని దినములు నింద్యము లగు;
నిన్నుఁ జూడనికన్నులు నీచము లగు. 259

క. జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబు లగుచుఁ దిరుగుచునుండున్
దనువులు నిలుకడ గావఁట
సనములలో నున్న నైన వాత్సల్యనిధీ! 260

సీ. పరమేశ! నీమంజుభాషలు విన లేనికర్ణరంధ్రంబులకలిమి యేల?
చిత్తగోచర! నిన్ను సేవింపఁగా లేనితనులతవలనిసౌందర్య మేల?
భువనమోహన! నిన్ను బొడగానఁగా లేనిచక్షురింద్రియములసత్వ మేల?
దయిత! నీనామామృతం బానఁగా లేనిజిహ్వకు ఫలరససిద్ధి యేల?

ఆ. వరద! నీదుదివ్యపాదపద్మంబులఁ
జేర్ప లేనిశిరము చెల్వ మేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మ మేల యెన్నిజన్మములకు? 261

సీ. నీపాదకమలంబు నిటలంబు సోఁకంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁ డేని,
నీమంగళ స్తవనికరవర్ణంబులు తలుమాఱు నాలుకఁ బలుకఁ డేని,
నీయధీనములుగా నిఖిలకృత్యంబులుఁ బ్రియభావమున సమర్పింపఁ డేని,
నీపదాంబుజముల నిర్మలహృదయుఁ డై చింతించి మక్కువఁ జిక్కఁ డేని,

తే. నిన్నుఁ జెవులార వినఁ డేని, నీకు సేవ
సేయ రాఁ డేని బ్రహ్మంబుఁ జెందఁ గలఁడె
యోగి యైనఁ దపోవ్రతయోగి యైన
వేది యైన మహాతత్త్వవేది యైన? 262

సీ. ఇది నీకు నెల వని యే మని పల్కుదు? నొకచోటనక యెందు నుండ నేర్తు;
చిన్నవాఁడ వం చే మని పలుకుదు? నీయంతవాఁడ వై నెగడ నేర్తు;
వీనడవడి యని యెట్లు వక్కాణింతుఁ? బూని ముప్పోకలఁ బోవ నేర్తు;
వది నేర్తు విది నేర్తు వని యేల చెప్పంగ? నేరుపు లన్నియు నీవ నేర్తు;

ఆ. వొరులు గారు నీకు, నొరులకు నీ వౌదు;
వొంటి వీవు; మట్టు మొకఁడు లేఁడు;
పెక్కుమాట లేల? వివరింతు నీటెంకి;
సుజనులందుఁ దఱచు సొచ్చియుందు. 263

ఆ. సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు,
నొకట విషమవృత్తి నుండు దరయ;
నిచ్చ లేనివారి కీవు భక్తులు గోరు
తలఁపు లిత్తు కల్పతరువుమాడ్కి. 264

ఆ. నీకు మేలు గొనవు నీభక్తులక కాని,
భక్తజనుల కీవ పరమగతివి;
భక్తుఁ డెందుఁ జనినఁ బరతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులుకోడెభంగి. 265

ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల
నాలి విడిచి, సంపదాలి విడిచి
నిన్ను కాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ వట్టివారి వైన. 266

క. పంచేంద్రియముల తెరువుల
బంధించి మనంబులందు పరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నిన్నున్
మంచివరుం బుణ్యసతులు మరగినభంగిన్. 267

క. సాధులహృదయము నీయది;
సాధులహృదయంబు నీవు; జగముల నెల్లన్
సాధుల నీవ యెఱుంగుదు;
సాధు లెఱుంగుదురు నీదుచరితము నీశా! 268

క. నీతేజము సాధులలో
నాతత మై యుండు, వారి నలఁచుజనులకున్
హేతిక్రియ భీతి నిచ్చుం,
జేతోమోదంబుఁ జెఱుచు సిద్ధము సుమ్మా! 269

క. నీదెసఁ దమచిత్తము లిడి
యేదెసలకుఁ బోక కడతు రెఱుక కలుగువా
రాదూడయుడుగుక్రియ నీ
పాదం బను నావకతన భవసాగరమున్ 270

క. నీవాఁడై నీదాసుఁ డమ
లావంబులు నిలిపి మునులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక
నీవలెవెడిమేటిచోట నెగడుదు రీశా! 271

క. లోకేశ యెల్లక నిన్నా
లోకించుప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతువు;
నీ కాశ్రితరక్షణములు నిజధర్మంబుల్. 272

చ. చలమున బుద్ధిమంతు లగుసాధులు నీహృదయంబు దొం
గిలికొనిపోవు చుందురు, రకిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభిరీతి; నా
వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతం జన కుందు వీశ్వరా! 273

చ. అరయఁగ శుద్ధభూతహృదయంబులయందుల నంతరాత్మవై
చిరముగ నుండునీవు భవదీయపదాంబురుహద్వయార్చనా
పరమతులైనవారికి శుభప్రదభూరిమనోరథంబు లీ
వరుదుగ నీవె? భక్తహృదయప్రమదప్రద! ముక్తిదాయకా! 274

మ. సముఁడై స్నేహముచే సుతత్వమును విశ్వాసంబుచేతన్ సఖి
త్వముఁ జాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్ సుమంత్రోపదే
శముచేతన్ నిజదేశికుం డనఁగ నిచ్చల్ పూజ్యుఁ డౌనిష్టుడై
తమకై భక్తుల కష్టకాలభయముల్ వారింతు సర్వేశ్వరా! 275

ఆ. అన్న మనునియందు, నమృతంబు గోవుల
యందు, వహ్ని సమిధలందు నమర
యోగవశతఁ బొందునోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు రధికగుణులు. 276

మ. నినుఁ జింతింపుచుఁ, బాడుచుం, బొగడుచున్, నీదివ్యచారిత్రముల్
వినుచుం జూతురు గాక, భక్తు లికరాశ్వోవంబులం జూతురే
భువనగ్రస్తపరంపరాహరణదక్షుం డై మహాయోగివా
గ్వినుతం బైనభవత్పదాబ్జయుగముల్ విశ్వేశ! విశ్వంభరా! 277

క. ఇంగలములోఁ డిసంగతి
బంగారము వన్నె గలుగుభంగి, భవత్సే
వాంగీకృతులయఘంబులు
భంగంబులఁ బొందు, ముక్తి ప్రాపించు హరీ! 278

క. నీ పేరు వినిన నొడివినఁ
బాపంబులు దూలిపోవు పరమేశ! జగ
ద్దీపక! నీ సేవనమున
నేపారవె భక్తజనుల కిహపరసుఖముల్? 279

క. నీపదయుగ మను నావను
ప్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి దాటి చేరుదు
రాపత్పదరహితు లగుచు నమృతపదంబున్. 280

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టము వైననీకుఁ దా
శాశ్వత మైనకాల మిది సర్వము వేసట నుందు రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడు గోరి భజించు, వాఁడ పో
శాశ్వతలక్ష్మిముక్తిజయసౌఖ్యయుతుం డభయుండు ధాత్రిపై. 281

శా. ఏవేళం గృపఁ జూచు, నెన్నఁడు హరిన్ వీక్షింతు నం చాధ్యుఁ డై
నీవెంటం బడి తొంటిపాపచయమున్ నిర్మూలముం జేయుచున్
నీవాఁ డై తనువాఙ్మనోగతుల ని న్సేవించువిన్నాణి వో
కైవల్యాధిప! ముక్తి నుద్ధవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా! 282

ఉ. ఎవ్వరు నీపదాంబుజము లెప్పుడు కొల్తురు భక్తినిష్ఠు లై,
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరివివేకశాలు రై,
యవ్విమలాత్ము లందుదు రుదంచితశోభననిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగ నీశ! నిను నేర్చి భజించిన రిత్త వోవునే? 283

చ. భరితనిదాఘతప్తుఁ డగుపాంథుఁడు శీతలవారిఁ గ్రోలి దు
ష్కర మగుతాపముం దొరగు కైవడి, సంసరణోగ్రతాపమున్
వరవునఁ బాయు చుందురు నిన్ను భజించుమహాత్మకుల్, జరా
మరణమనోభయంబులఁ గ్రియంబునఁ బాయుట చెప్ప నేటికిన్? 284

మ. అనఘాత్మా! భవదీయదివ్యపదసేవాసక్తు లైనట్టియ
జ్జనముల్ మృత్యుశిరంబుఁ దన్ని ఘనసంసారాంబుధిన్ దాటి పా
వను లై లోకములంం బునీతములుగా వర్తించుచున్ నిత్యశో
భన మై యొప్పెడిముక్తిఁ బొందుదురు కుంభద్వైభవోపేతు లై. 285

తే. ఈశ! నీపాదమూలంబు లెవ్వఁ డేనిఁ
బొంది ధన్యాత్ముఁ డౌ, నట్టిపుణ్యుఁ డొందు
మనములోపలఁ గోరునే మఱచి యైన?
నవ్యయానంద! యకలంక! హరి! ముకుంద! 286

క. పురుషోత్తమ! నీపదసర
సీరుహధ్యానామృతాభిషేకస్ఫురణం
గర మొప్పువారిచిత్తము
లరపన్నృపులందు వాంఛ దగులునె యెందున్? 287

క. యోక్తిం దలఁప భవద్వ్యతి
రిక్తము లైనట్టియితరదృఢకర్మంబుల్
ముక్తిదము లయిన నీపద
భక్తులు తత్కర్మములను బాటింప రిలన్. 288

చ. నిరతముఁ దావకీనభజనీయపదాబ్జసుగంధలబ్ధి నె
వ్వరిమది వొందఁగాఁ గలుగు, వారలు తత్ప్రియమర్త్యదేహముం
గరము తదీయదారసుతకామసుహృద్గృహబంధువర్గమున్
మఱతురు విశ్వతోముఖ! సమాశ్రితరక్షక! పాపశిక్షకా! 289

చ. సరసవిలోల! సత్పురుషసంగసమంచితభక్తియోగవి
స్ఫురణ ననుగ్రహింపఁబడి శుద్ధము నొందినవానిచిత్తము
స్థిరబహిరంగముం గనదు, చెందదు ఘూర్ణితమస్స్వరూపసం
సరణగుహాం, జిరంబు గనఁ జాలు భవన్మహనీయతత్త్వమున్. 290

ఉ. కేవలకీర్తనీయగతకిల్బిషపుంగవ తీర్థకీర్తిను
తీవిభవప్రశస్తసుచరిత్రుఁడ వైనభవత్పదాబ్జసే
వావిమలాంతరంగబుధవర్గ మనర్గళభంగి నన్యమున్
భావమునం దలంచునె? కృపాగుణభూషణ! పాపశోషణా! 291

మ. విమలజ్ఞాననిరూఢు లైనజనముల్ వీక్షింప మీపాదకం
జమరందస్ఫుటదివ్యసౌరభము నాస్వాదించి నిర్వాణరూ
పము, సత్పూరుషవాగుదీరితము, శోభాశ్రీనివాసంబు నా
మిము సేవింపక మానవాధముని దుష్కర్మాత్ము సేవింతురే? 292

ఉ. పూని భవత్పదాంబురుహమూలనివాసులు లైనవారు మే
ధానిధి! నీవిలోకనముఁ దక్కఁగ నన్య మెఱుంగ నేర్తురే?
మానితపారిజాతకుసుమస్ఫుటనవ్యమరందలుబ్ధశో
భానయశాలి యైనమధుపంబు భజించునె యన్యపుష్పముల్? 293

సీ. నీరదాగమమేఘనిర్యత్పయఃపానచాతకం బేగునే చాటిపడకుఁ?
పరిపక్వమాకందఫలరసంబులు గ్రోలుకీరంబు చనునె తుత్తూరములకు?
ఘనరవాకర్ణనోత్కలికమయూరంబు కోరునే కఠినఝిల్లీరవంబు?
కరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ మరుగునే శునకమాంసాభిలాషఁ?
తే. బ్రవిమలాకార! భవదీయపాదపద్మ
యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ?
భక్తమందార! దుర్భవభయవిదూర! 294

చ. వరమతి నార్తబాంధవ! భవద్ఘనబోధసమేతుఁ డై భవ
చ్చరణముఁ బొందినట్టివిధిసర్గము నుత్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గనునట్టిముముక్షుశరణ్యు మైననీ
చరణములం గృతజ్ఞుఁ డగుసజ్జనుఁ డెట్లు దలంప కుండెడున్? 295

మ. చెలి వై, చుట్టమ వై, మనశ్శ్రితుఁడ వై, చిన్మూర్తి వై, యాత్మ వై,
వల వై, కోర్కులపంట వై, విభుఁడ వై వర్తిల్లు నిన్నొల్లకే
పలువెంటం బడి లోక మక్కట! వృథాబద్ధాశ మై పోయెడిన్;
నిలువ న్నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డానందుఁ డై? 296

సీ. శోకదావాగ్నిశిఖాకులితంబు, పృథుక్లేశఘనదుర్గదుర్గమంబు
దండధరక్రూరకుండలిశ్లిష్టంబు, పాపకర్మవ్యాఘ్రపరివృతంబు,
గురుసుఖదుఃఖకాకోలపూరితగర్త మగుచు నసాశ్రయ మైనయట్టి
సంసారమార్గసంచారు లై మృగతృష్ణికలఁ బోలువిషయసంఘము సహాస్మ

తే. మేలి హేతుక దేవాని కేతనములు
నయి, మహాభాగవతు లైనయట్టి మూఢ
జనము లేనాఁట మీపదాబ్జములు గానఁ
జాలువారలె? భక్తప్రసన్న! దేవ! 297

చ. మహిఁ దలపోయ నెవ్వనిసమగ్రపరిగ్రహముక్ లభింప ని
స్పృహమతు లై మునీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు, రట్టిస
న్మహితవివేకశాలి! గుణమండన! నీ కిల నన్యసత్పరి
గ్రహ మది యెట్టిపోద్యము? జగత్పరిపాలన! నిత్యఖేలనా! 298

మ. క్రతుదానోగ్రతపస్సమాధిజపసత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాచరింప నఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారుభవత్పదాబ్జయుగళీసేవాభిపూజాసమ
ర్పితధర్మం బగువానిభంగి నఘహారీ! దేవచూడామణీ! 299

సీ. దేవ! దుర్జనులకు భావింప హృదయసంగతుఁడ వై యుండియుఁ గానఁబడవు;
కడఁగి నీదివ్యమంగళవిగ్రహంబునఁ జేసి సమంచితాశ్రితుల నెల్లఁ
జేకొని సంప్రీతచిత్తులఁ గాఁ జేయు దతిశయకారుణ్యమహిమఁ దవర్చి
కరుణాత్మ! సర్వలోకప్రజాధిప! భవదనుసరణాభిలాషానులాప

తే. విదితదృఢభక్తియోగప్రవీణు లగుచు
నర్థిమై వీతరాగు లైనట్టియోగి
జనమనఃపంకజాతనిషణ్ణమూర్తి
వని యెఱుంగుదు రయ్య ని న్నాత్మవిదులు. 300

సీ. యజ్ఞేశ! విశ్వంభరామృత! శ్రవణమంగళనామధేయ! లోకస్వరూప!
యాపన్నభక్తజనార్తివిఖండన! దీనలోకాధార! దివ్యతేజ!
విశ్వోద్భవస్థితివిలయకారణభూత! సంతతానంద! శశ్వద్విలాస!
సర్వలోకాధీశ! సర్వాత్మ! సర్వజ్ఞ! భక్తగృహాంగణపారిజాత!

తే. భూరివిజ్ఞానయుక్తియు, ముక్తిపదము
నిన్నుఁ గొలువనినరులకు నెఱయఁ గలదె?
వినుతమందార! గుణహార! వేదసార!
ప్రణతవత్సల! భద్రాత్మ! పరమపురుష! 301

# ప్రార్థన

క. సాధుజనావనకలితము
పోషనములు, పుణ్యాకల్పితామలపథసం
బోధనములు, మోక్షగమన
సాధనములు దేవదేవుసంప్రార్థనముల్. 302

ఆ. పరమపురుష! పరమపావన! పరమేశ!
భక్తవరద! భద్రి! భవవిదూర!
దురితహరణ! నిన్ను శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావ వయ్య మమ్ము. 303

క. ఆలింపుము విన్నప మిదె
వేలుపుగమి కేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోనిచిక్కు మానిచి
నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా! 304

క. సర్వము నీవ యెఱుంగుదు
సర్వవిలోకనుఁడ వీవ సర్వాత్ముఁడవున్
సర్వాపరాధు నను నో
సర్వేశ! యనుగ్రహింపు సర్వాధారా! 305

క. నీమహిమ యెఱిఁగి పొగడఁగ
నే నెంతటివార? మఖిలనేతవు, త్రిజగ
త్క్షేమంకరుఁడవు, సుమతివి
తామసుల మగుమమ్ముఁ గావఁ దగుఁ బరమేశా! 306

మత్త. నిన్ను నీశ్వర! దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామలకీర్తిశోభిత! సర్వలోకశరణ్య! నే
నెన్నరానిమహాపరాధము లెన్నొ చేసితి నీయెడన్
నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ! 307

తే. దాసజనకోటి కతిసౌఖ్యదాయకములు
వితతకరుణాసుధాతరంగితము లైన
నీకటాక్షేక్షణములచే నెలయ మమ్ముఁ
జూచి సుఖులను జేయవే శుద్ధచరిత! 308

తే. అకట! దిక్కుల కెల్ల దిక్కైనమాకు
నొక్కదిక్కును లేదు కా లూద నైన
దిక్కుగా నయ్య దేవ! మాదిక్కుఁ జూచి
దిక్కు లేకున్నవారలదిక్కు నీవ. 309

క. నీపాదంబులు నమ్మిన
నాపద లెక్కడివి జనుల కత్యుగ్రమహా
దీపితపాపజ్వాలనము
పైఁ బడ కుండెడివిధంబు భావింపఁ గదే! 310

ఆ. అంధకారవైరి యుదయాద్రి యవ్వల
జనిన నంధ మయినజగముభంగి
నీవు మామనముల నెగడక యుండిన
నంధతమసయుతుల మగుదు మీశ! 311

క. నీపాదకమలసేవయు,
నీపాదార్చకులతోడినెయ్యము, నితాం
తాపారభూతదయయును
దాపసమందార! నాకు దయసేయఁ గదే! 312

క. నాకున్ సఖ్యము పుణ్య
శ్లోకులతోఁ గాని తత్త్వశూన్యులు సంసా
రైకవిమోహులతోడం
గా కుండ నొనర్పు మయ్య కలుషవిదూరా! 313

శా. నీపద్యావళు లాలకించుచెవులున్, నిన్నాడువాక్యంబులున్
నీపేరం బని సేయుహస్తయుగముల్, నీమూర్తిపైఁ జూపులున్,
నీపాదంబులపొంత మ్రొక్కుశిరముల్, నీసేవపైఁ జిత్తముల్,
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నిర్వాణసంధాయకా! 314

శా. దేవా! నీచరణప్రసాదకణలబ్ధిం గాక లే కున్న నోం
డే వెంటం జను నీమహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?
నీవారై చనువారిలో నొకఁడ నై నిన్ గొల్చుభాగ్యంబు నా
కీవే యెప్పటికైన నన్నుఁ గరుణన్ వీక్షించి విశ్వేశ్వరా! 315

చ. అరయఁగ భక్తపాలనము లైనభవద్గుణజాల మాత్మ సం
స్మరణము సేయ, వాక్కు నిను సన్నుతి సేయ, శరీర మెల్లఁ గిం
కరపరివృత్తి సేయ మదిఁ గాంక్ష యొనర్చెదఁ నంతె కాని నా
కరుదుగఁ జక్రవర్తిపద మైన నొసంగిన నొల్ల నీశ్వరా! 316

తే. భక్తజనసంతతానందభద్రకరము
భూరిసంసారసాగరోత్తారణంబు
నవ్యయానందమోక్షదాయకము నైన
నీపదధ్యానమాత్మలో నిలుప నీవె! 317

ఆ. భక్తకామదంబు, ముక్తిదాయక, మిలా
మండనంబు, దుఃఖమర్దనంబు,
భద్రకరము నైనభవదంఘ్రియుగము మా
మనములందు వరద! యునుపఁ గదవె! 318

తే. ఘోరసంసారసాగరోత్తారణంబు
ధీయుతజ్ఞానయోగిహృద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందునీచరణాంబుజాత
యుగళమును మామనంబులఁ దగుల నీవె! 319

ఆ. స్వప్రకాశ! సకలజగదంతరాత్మ వై
నట్టిదేవ! నీపదారవింద
యుగళి సానురాగయుక్త మై నామదిఁ
గలుగునట్లుగాఁగఁ దలఁపు మనఘ! 320

ఉ. వేదవధూశిరోమహితవీధులఁ జాల నలంకరించునీ
పాదసరోజయుగ్మము శుభస్థితి మాహృదయంబులందు ని
త్యోదితభక్తిమైఁ దగిలి యుండునుపాయ మెఱుంగఁ బల్కు వి
శ్వోదర! భక్తదుర్భవపయోనిధితారణ! సృష్టికారణా! 321

సీ. నీచరణంబులు నిఖిలలోకస్తుత్య! సనకాదిమునియోగసరణి త్రొవ్వ;
నీపాదతలములు నిరవద్య! శ్రుతివధూసీమంతవీథులఁ జెన్ను మిగులు;
నీపదాబ్జంబులు తాపసమందార! భక్తులపాలిటిపట్టుఁగొమ్మలు;
నీసుందరాంఘ్రులు నిత్యనికేతన! ముక్తికాంతామనోమోహనములు;
గీ. నీయడుగులపరాగంబు నిష్కళంక!
యఖిలజనములు శిరములయందుఁ దాల్తు;
రట్టిభవదీయదివ్యపాదారవింద
యుగళి మామకమనమునఁ దగుల నీవె!. 322

ఉ. తండ్రుల కెల్లఁ దండ్రివియుఁ, దల్లుల కెల్లను దల్లి వీవు! మా
తండ్రివిఁ, దల్లివిం, బతివి, దైవమవున్, సఖివిం, గురుండవుం;
దండ్రులుఁ దల్లులున్ సుతుల ధన్యులఁ జేసిరె నీవిధంబునన్?
దండ్రి! నినున్ భజించెదము దాసుల మమ్ము ననుగ్రహింపవే! 323

ఉ. ఆఁకలి గొన్న క్రేపులు రయంబున నీఁకలు రానిపక్షులున్
దీకొని తల్లికిన్, మఱి విదేశగతుం డగుభర్త కారిమై
వ్యాకులచిత్తయైనజవరాలును దత్తఱమందుభంగి, నో
శ్రీకర! భక్తపాల! నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే! 324

తరల. కడుపులోపల నున్న పాపఁడు గాలఁ దన్నినఁ గిక్కుతో
నడుమఁ బ్రోలునె కాఁగి తల్లికి? నాద్య! సన్నము దొడ్డునై
యడఁగి కారణకార్యరూపము నైనయీసకలంబు నీ
కడుపులోనిది గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్? 325

ఉ. నేరము లెన్న నెక్కుడివి? నేము దలంపుతలంపులందులో
నేరుపు లున్నవే? సుతుల నేరమిఁ దండ్రులు త్రోసిపుచ్చరే?
నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?
నేరము గల్గుమమ్ము దయ నేఁ డిటఁ గావఁ గదే కృపానిధీ! 326

చ. కడపటిసేఁత నైహికసుఖంబులఁ గోల్పడి రిత్తకోర్కెవెం
బడిఁ బడి యెండమావులను బాలిశులై సలిలాశ డాయుచుం
జెడుమనుజుల్ భవాబ్ధి దరిఁ జేరఁగ లేక నశింతు రట్టియా
యిడుమలఁ బొందఁ జాలము పరేశ్వర! లోకశరణ్య! కావుమీ! 327

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయాలతాబద్ధులై
యిది మిథ్యమ్మన లేరు, తామసులమై యేపారుచుం బోఁటిదు
ర్మదు లేరీతి నెఱుంగఁ జాలుదురు సమ్యగ్జ్ఞానధీయుక్తి? నీ
పదముల్ చేరెడి త్రోవఁ జూపి భవకూపంబుం దరింపింపవే! 328

మ. తమలోఁ బుట్టునవిద్య గప్పికొనఁడుం దన్మూలసంసారవి
భ్రమలై కోఁదలు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గమునం దేపరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదం బందుదు రట్టినీవు కరుణం బాలింపు మ మ్మీశ్వరా! 329

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్నె తెఱంగు, మూఢునకు సన్మతి దా గురుఁ డౌట నూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండువ రేశ! మాకు న
ద్యన్నయమూర్తివై గురువవై యలసద్గతిఁ జూడఁ జూపవే! 330

చ. పరఁగుచు నున్నదుర్వ్యసనభాజనమై, ఘనదుఃఖమూలమై,
యరయఁగఁ బెక్కుతూంట్లు గలదై, క్రిమిసంభవమైనయట్టిదు
స్తరబహుగర్భవాసములసంగతి మాన్పుటకై భజింతు నీ
శ్వర! భవదీయభూరిభవసాగరతారకపాదపద్మముల్. 331

మ. కలలం బోలెడిపుత్రమిత్రవనితాగారాదిసంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయుచందంబునన్
దలఁతున్ సత్యము లంచు మూఢుఁడ, వృథాతత్త్వజ్ఞుఁడన్; నన్ను నీ
విలసత్పాదయుగంబుఁ జేర్చి కరుణన్ వీక్షింపు విశ్వేశ్వరా! 332

ఉ. భూరిమదీయమోహతమముం బెడఁబాప సమర్థు లన్యు లె
వ్వారలు నీవ కాక? నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతాలవిత్ర! బుధసత్తమ! సర్వశరణ్య! ధర్మవి
స్తారక! సర్వలోకశుభదాయక! నిత్యవిభూతినాయకా! 333

చ. హరిభజనీయమార్గనియతాత్మకులై భవదీయమూర్తిపై
వఱలినభక్తియుక్తు లగువారలసంగతిఁ గల్గఁ జేయుస
త్పురుషునిసంగతిన్ వ్యసనదుస్తరసాగర మప్రయత్నతన్
సరసభవత్కృపామృతరసంబున మత్తుఁడనై తరించెదన్. 334

చ. సమధికతేజ! దుఃఖలయసాధన మై తగు తావకీనరూ
పము ననివార్యదుర్భరవిపద్దశ దుఃఖము నొందుచూను నీ
సుమహితసత్కృపాగరిమఁ జూపుట కంటె మఱుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి గల్గునె? భక్తఫలప్రదాయకా! 335

ఉ. నీవు చరాచరప్రచయనేతవు, ధాతవు, సర్వలోకపా
లావళిమౌళిభూషణుఁడ, వంచితమూర్తివి, దేవదేవ! దీ
నావన! నీ తెలుంగని దజాండమునం దినుమంత యున్నదే?
భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్. 336

చ. కర మనురక్తి షట్పదము గమ్రసుగంధమరందవాంఛచేఁ
దర మిడి శాతకంటకవృతస్ఫుటపత్రతరప్రసూనముం
జతులను డాయుపోల్కిని, భృశం బగువిఘ్నములన్ జయించునీ
చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితి మయ్య యీశ్వరా! 337

శా. రాఁడా? చూడ సమస్తభూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్
లేఁడా? నాహృదయంబునందలివికల్ లీలాగతిన్ ద్రోచి, నా
కీఁడా నేఁ డభయప్రదాన? మతఁ డూహింపన్ నతత్రాత దాఁ
గాఁడా? రెండవుఁ గావఁ? డీయెడల నన్ గావంగ రా కుండునే? 338

సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములు లేక కలుగువాఁడు?
నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడినసాధుల కడ్డపడెడువాఁడు?
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు?
లీలతో నామొఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు?

తే. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యలరువాఁడు
భక్తజనముల దీనులపాలివాఁడు
వినఁడె? చూడఁడె? తలఁపఁడె? వేగ రాఁడె? 339

శా. లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలం బయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్;
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ, మన్నింపం దగున్ దీనునిన్;
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! 340

ఉ. ఓకరుణాత్మ! యోవరద! యోపవిత్రవిపత్తువిపత్తుదూర! కు
ర్యోత్యకవియోగివంద్య! సుగుణోత్తమ! యోశరణాగతాశ్రితా
నోకహా! యోమునీశ్వరమనోహర! యోవిమలప్రభావ! రా
వే! కరుణింపవే! దలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే! 341

సీ. ఏనీగుణములు కర్ణేంద్రియంబుల సోఁక దేహతాపంబులు దీఱిపోవు;
ఏనీశుభాకార మీక్షింపఁ గన్నుల నఖిలార్థలాభంబు గలుగు చుండు;
ఏనీచరణసేవ సేప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబు బొందఁ గలుగు;
ఏనీలసన్నామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు;
తే. నట్టినీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది, నీయాన నాన లేదు;
కరుణఁ జూడుము సర్వేశ! పరమపురుష!
చిన్మయాకార! సన్మునిచిత్తచోర 342

సీ. నీపాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని కదలిపోవంగఁ బాదములు రావు;
నీకరాబ్జంబులు నెఱి నంటికొనఁ గాని తక్కినపనికి హస్తములు సోరవు;
నీవాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చెవు లన్యభాషలు సేరి వినవు;
నీసుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కికవలు;
ఆ. నిన్న కాని పలుక నేరవు మా జిహ్వ। లొల్ల ననుచుఁ బలుక వొల్ల వీవు;
మామనంబు లెల్ల మరపించి దొంగిలి। తేమి చేయువార మింక వరద! 343

మ. జ్వరితార్తుం డగువాని కౌషధ మభీష్టం బైనచందంబునన్
ధరలో నాతపతప్తదేహి కడుశీతం బైనతోయంబునున్
గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహిదష్టుండ నై
పరఁగు న్నాకు భవద్వచోమృతము దప్పన్ మందు వే యున్నదే? 344

సీ. ఈపాపదావాగ్ని నేమిట నార్తుము నీమంజువాగ్వృష్టి నెగడ దేని?
ఈకల్మషాంభోధి నేత్రోవఁ గడతుము నీసేవ నావ యై నిలువదేని?
ఈపాతకధ్వాంత మేజాడఁ జెఱుతుము నీహాసచంద్రిక నిగుడ దేని?
ఈకిల్బిషజ్వర మేభంగి నడతుము నీదయామృతమును నించ దేని?
ఆ. ఎట్లు నిర్వహింతు? మేలాగు మాలాగు? కరుణ సేయ వేని, గదియ వేని,
ది క్కెవండు మాకు? దీనచింతామణి! । ఏమి సేయువార మింక నీశ! 345

సీ. దారుణమోహాంధకారపూరితుఁడను, హరివిస్మయస్మరణాగ్రమతి నె?
పంచమహాతీవ్రపాతకోపేతుఁడ, హరివిస్మయస్మరణాగ్రమతి నె?
కౌటిల్యకితవవికారహారిణుండ, హరివిస్మయస్మరణాగ్రమతి నె?
యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ, హరివిస్మయస్మరణాగ్రమతి నె?
తే. నిందలకు నెల్ల నెల వైననిర్గుణుండ, మందభాగ్యుండ, నే నేడ? మంగళకరు
దివ్యగుణనామకీర్తనలెఱుఁగ దేడ? భూరిసుకృతంబు లే కట్లు పొందఁ గలుగు? 346
సీ. కామహర్షాదిసంకలిత మై చిత్తంబు భవదీయచింతనపదవి సారదు;
మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ నీవర్ణనమునకు నిగుడ నీదు;
సుందరీముఖములఁ జూడఁ గోరుచుఁ జూడ్కి తావకాకృతులపైఁ దగులుపడదు;
వివిధదుర్భాషల వినఁ గోరువీనులు వినవు యుష్మత్కథావిరచనములు;
తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకుఁ
దవులు గొలుపదు దేవ! సద్ధర్మములకు;
నడఁగి యుండవు కర్మేంద్రియములు, పురుషుఁ
గలఁడు, సవతులు గృహమేధిఁ గలఁచునట్లు. 347
సీ. విశ్వంబు నీవ యై, విశ్వంబుఁ గాచుచు, విశ్వంబు సేయుచు, విశ్వమునకు
హేతువ వై పంచభూతమాత్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధిచిత్త
ముల కెల్ల నాత్మ వై, మొనసి గుణంబుల నావృత మగుచు, నిజాంశభూత
మగునాత్మచయమున కనుభూతి సేయుచు, మూఁడహంకృతులచే మూసుపడక,
తే. నెటి వనంతుఁడ వై, దర్శనీయరుచివి
గాక సూక్ష్ముఁడ వై, నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁడ వన సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెదఁ గావుము నిర్మలాత్మ! 348
సీ. పూర్ణుఁ డయ్యును మహాభూతపంచకయోగమున మేను లనుపురముల సృజించి,
పురములలో నుండి పూర్ణభావంబున దీపించు నెప్పుడు ధీరవృత్తిఁ
బంచభూతములను బదునొకండింద్రియములఁ బ్రకాశింపించి భూరిమహిమ
షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వనిత్యవినోదంబు నెఱపు చుండు
తే. నట్టిభగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు। మానసోదితవాక్పుష్పమాలికలను
మంజునవతసమకరందమహిమ పుట్ట। శిష్టహృద్భావలీలలఁ జేయఁ గాక! 349

